


అంతర్జాతీయ పిల్లల సంవత్సరం 79 సందర్భంలో

# chic-modithread

వారు ప్రప్రథమంగా సమర్పిస్తున్నారు.

# పిల్లల కుట్టుపని పోటీ








### ఎలా పాల్గొనాలి?

ఈ పైన చూపబడిన ఏనుగు డిజైను పోటీ ఎంట్రీ ఫారం మీద సరైన సైజు ప్రింటు చేయబడింది. మీరు చేయవలసినదల్లా ఈ డిజైను గాని లేదా మీకు నచ్చిన అంకితమైనా డిజైను గాని కనీసం 12×12 సెంటి మీటర్లు, ఎంబ్రాయిడరీ (అప్లిక్) నిటింగ్ క్రొచెట్ టాటింగ్, అప్లిక్ వర్క్ లేక మీ చేతిపనుల నైపుణ్యం చూపించండి. కుట్టుపని అంతా మోడిత్రెడ్‌తోనే చేయాలి. మీ అందమైన డిజైను రంగుల కలయిక, కుట్టిన కుట్టుకి వీటికి తోడు అతి నీటుగా ఉన్న ఎంట్రీలు మాత్రం ఎన్నుకోబడతాయి. పోటీ ఎంట్రీ ఫారమ్ సరిగ్గా నింపి, మీరు వాడిన మోడిత్రెడ్ లేబుల్స్‌ను ప్రతి ఎంట్రీతోను జతచేసి పంపాలి.

పోటీ ఎంట్రీ ఫారమ్ మరియు నిబంధనలు, షరతులు మోడిత్రెడ్ డీలర్లు, మోడి క్రాఫ్ట్ షాపులు, మోడి డిపోలు మరియు డిస్ట్రిబ్యూటర్లు ఇంకా చిక్ మేగజైనులు ఏప్రిల్, మే, జూన్, జూలై 1979 సంచికలలో లభించును.

### గెలుచుటకు అనేక అవకాశాలు

ఈ పోటీ దేశమంతటా 10 ప్రాంతాలుగా విభజించబడింది. ఒక్కొక్క ప్రాంతానికి 566 బహుమతులు. ప్రతి ప్రాంతంలోనూ మొదటి బహుమతిగా గెలుపొందిన ఎంట్రీలు అద్భుతమైన రాష్ట్రీయ బహుమతికి ఎన్నుకోబడతాయి. ఎంట్రీలు మీ ప్రాంతంలోనున్న మోడిత్రెడ్ డిపోకి పంపండి, షరతులు, నిబంధనలలో దీని వివరము ఇవ్వబడింది.

ప్రతి ప్రాంతంలోను వేరు వేరుగా రెండు గ్రూపులకు వయసు వారిగా బహుమతులు ఇవ్వబడతాయి.

### 6 నుండి 11 సంవత్సరముల వారికి :

**Grand National Prize** Chic Modithread Scholarship worth Rs. 1000/- and "Needlework Young Princess 1979 Trophy" plus a Childcare hamper of dresses, toys and nursery furniture worth Rs. 1000/-.

**Ten 1st Prizes** Childcare hampers of dresses, toys and nursery furniture. Each hamper worth Rs. 500/-.

**Ten 2nd Prizes** Sets of dresses from chic Creations. Each set worth Rs. 200/-.

**Ten 3rd Prizes** Each worth Rs. 100/-. Gift hampers of Johnson's* Baby Powder, Johnson's* baby soap and Johnson's* baby cream. *Trade Mark

**100 Merit Prizes** Sets of Children's books from U.S.S.R. Book Centre and Lok Vangmaya Griha (Pvt.) Ltd., Bombay. Each set worth Rs. 20/-.

**100 Consolation Prizes** S.N.P. FUN-N-COLOUR Painting Kits worth Rs. 17/- each.

### 12 నుంచి 16 సంవత్సరముల వారికి :

**Grand National Prize** Chic Modithread Scholarship worth Rs. 1000/- and "Needlework Princess 1979 Trophy" plus a gift cheque from Childcare worth Rs. 1000/-.

**Ten 1st Prizes** Gift cheques from Childcare Each worth Rs. 500/-.

**Ten 2nd Prizes** Sets of dresses from chic Creations. Each set worth Rs. 200/-.

**Ten 3rd Prizes** Each worth Rs. 100/-. Gift hampers of Johnson's* Baby Powder, Johnson's* Complexion Cream and Carefree* Sanitary Napkins. *Trade Mark

**100 Merit Prizes** Sets of books from U.S.S.R. Book Centre and Lok Vangmaya Griha (Pvt.) Ltd., Bombay. Each set worth Rs. 20/-.

**100 Consolation Prizes** Chic Needlework Kits worth Rs. 17/- each.

**First 500 entries in each of the ten territories will receive a Duraflex Plastic book jacket**

పిల్లల ప్రత్యేక విభాగం చిక్ మేగజైనులోని చిక్-చెప్పు చదవండి.

పోటీ వివరములకు Chic Publications, Akash Ganga, 89, Bhulabhai Desai Road, Bombay 400036.

త్వరపడండి! పోటీ ముగింపు తేది 31 జూలై 1979

ఎంట్రీలు మీ ప్రాంతంలోని మోడిత్రెడ్ డిపోకి పంపండి. షరతులు, నిబంధనలలో దీని వివరము చూడండి.

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం?






మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ పెద్దది (30 గ్రాములది) ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్కులు లభిస్తాయి.

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి.

**త్వరపడండి!**

ఎంట్రీలు గ్రహింపబడేందుకు ఆఖరు తేది : 8-6-1979




"Fun with Gems", Dept. No. B-12
Post Box No. 56,
Thane 400 601, Maharashtra.

**చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ "మానవత్వం" ]కు ఆధారం యండ పల్లి పాండురంగ రచన. సంఘంలో నేరాలు చేసే వారందరూ మానవత్వం లేనివాళ్ళేననుకో నవసరంలేదు. నేరస్థులలో నేరాలకు కారణాలు తెలుసుకోవటమూ, మానవత్వం గుర్తించి దాన్ని బలపరచటమూ శిక్షాస్మృతికి అవసరం.

## అమరవాణి

ఏకాకీ, గృహసంత్యక్తః,
పాణిపాత్రో, దిగంబరః,
సోపి సంబాహ్యతే లోకే
తృష్ణాయా పశ్య కౌతుకం.

[ఒంటిగాడూ, ఇల్లూ వాకిలీ విడిచినవాడూ, భిక్షాపాత్ర పట్టినవాడూ, దిగం బరుడూ సైతం దురాశకు గురి అవుతాడు.]

సంపుటి 64 మే '79 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**అశోక్ మంగళూరి, అథణి (కర్ణాటక)**

ప్ర: ధూమకేతు అనేది ఏమిటి?

న: సూర్యుడు కేంద్రంగాగల సౌరకుటుంబంలో ఆ కేంద్రం చుట్టూ పరిభ్రమించుతూ గ్రహాలూ, ఉపగ్రహాలూ, గ్రహశకలాలూ, ఉల్కాలూ, తోకచుక్కలూ ఉన్నాయి. ఇవి దీర్ఘవృత్త కక్ష్యలలో తిరుగుతూ, సూర్యుడికి చాలా దగ్గిరిగా వచ్చి, తిరిగి చాలా దూరం వెళ్ళిపోతుంటాయి. సూర్యుడి సమీపంలోకి వచ్చినప్పుడే వీటికి "తోక" ఉండటం మనం చూస్తాం. దూరంగా ఉన్నప్పుడివి గోళాకారంలోనే ఉంటాయి. వీటి కేంద్రంలో ఘనపదార్థంతో బాటు ఘనీభవించిన వాయుపదార్థం ఉంటుంది. సూర్యుడి కాంతికి ఈ పదార్థం ఆవిరి అయి, ధూమకేతువు "తల"కు దూరంగా కొట్టుకుపోయి, "తోక"లాగా కనబడుతుంది. గ్రహచలనాలను గురించి మూఢవిశ్వాసాలు ఉన్నట్టే తోక చుక్కలు కనబడటం గురించి కూడా మూఢనమ్మకాలున్నాయి.

**బాళ్ శి. జంభేకర్, బసీన్ (మహారాష్ట్ర)**

ప్ర: మబ్బులు నల్లగా ఉంటాయి. వాననీరు తెల్లగా ఎందుకుంటుంది?

న: నీరు తెల్లగా ఉండదు. సూర్యకాంతిని మబ్బులలోని నీరు నిరోధించగలిగినప్పుడు అవి నల్లగా కనిపిస్తాయి. నీటికి రంగు లేదు.

ప్ర: కొండలు ఎలా ఏర్పడతాయి?

న: భూఖండాల దిగువన రాతిపలక ఉంటుందనీ, భూఖండాలు కదులుతున్నాయనీ ఈనాడు శాస్త్రజ్ఞులకు తెలుసు. ఇలాటి కదలికవల్ల రెండు భూఖండాల మధ్య ఒరిపిడి కలిగినప్పుడు దిగువన ఉన్న రాతిపలక మణిగి పైకి పొడుచుకు వస్తుంది. పర్వత పంక్తులన్నీ అలా ఏర్పడినవే. మనం భారతదేశం అని చెప్పుకునే భూఖండం ఆసియాఖండాని కేసి నొక్కుకుంటున్న కారణం చేతనే హిమాలయపర్వత పంక్తులు ఏర్పడ్డాయి. అవి ఇంకా పైకి లేస్తూనే ఉన్నాయి. హిమాలయ శిఖరాలు ఒకప్పుడు సముద్రం అడుగున వుండేవనటానికి నిదర్శనంగా వాటిమీద జలచరాల అవశేషాలు దొరుకుతున్నాయి. భూఖండాల మధ్య ఒరిపిడి నిలిచిపోగానే పర్వతాలు పెరగటం మాని, వానకూ, ఎండకూ, గాలికీ గురిఅయి తరిగిపోనారంభిస్తాయి. తూర్పు తీరాన వున్న కొండలు అరిగి, తరిగి పోతున్నవే.




# 71

మంగలి తాను చూసినది ఎవరికీ చెప్పనని మణిభద్రుడికి ప్రమాణం చేసి, వెళ్ళిపోయాడు. వెళ్ళుతూ దారిలో వాడు ఇలా అనుకున్నాడు :

"దిగంబర జైనుడి నెత్తి మీద చేవ కర్రతో కొట్టితే బంగారు విగ్రహంగా మారుతాడన్నది కళ్ళారా చూశాను. ఈ సంగతి ముందే తెలియక ఎంత బుద్ధి తక్కువవాణ్ణి అయాను! నేను రోజూ ఆరు గంటలపాటు రకరకాల మనుషులకు క్షౌరం చేసి సంపాదించే ఆరేడు వెండి నాణాలు నా సంసారం గడవటానికి చాలవు గదా. ఇంతమంది దిగంబర జైనులు తిరుగుతున్నారు. నాకీ సంగతి మాటమాత్రం తెలిస్తే, మణిభద్రుడి లాగా పదినిమిషాలలో లక్ష బంగారు నాణాలు సంపాదించుకుని ఉందునే! డబ్బు చెయ్యటంలో వైశ్యుడికి మంగలి సాటి రాడంటే అందులో అబద్ధం ఏమున్నదీ? ఉన్నట్టుండి మనుషులు లక్షాధికారులు ఎట్లా అవుతారా అని ఆశ్చర్యపడి, అదంతా వారి తెలివితేటలూ, వ్యాపార దక్షతా కాబోలు ననుకునేవాణ్ణి! కావలసిందల్లా మంచి దుడ్డుకర్రా, దిగంబర జైనుడూ, బలమైన దెబ్బా! తమ కులం మటుకే బాగుపడాలని వైశ్యులు ఈ రహస్యం ఎవరికీ చెప్పరు. కాని నాకు తెలిసి పోయింది! రేపు ఊళ్లో ఉన్న దిగంబర జైనుల నందరినీ మా ఇంటికి ఆహ్వానించి, వాళ్ళ బుర్రలు బద్దలుకొట్టి, అంతులేని బంగారం సంపాదించుకుంటాను. అదంతా ఒకవేళ నేను దుబారాగా ఖర్చు చేస్తే – దేశంలో దిగంబర జైనులకు కొదవా?"



ఇలా అనుకుని మంగలి బోలెడన్ని దుడ్డుకర్రలు తెచ్చి, తన ఇంటి చావడిలో బోషాణంలో దాచి ఉంచి, ఆ రోజల్లా ముళ్ళమీద ఉన్నట్టుగా గడిపి, మర్నాడు తెల్లవారగానే, నగరంలో ఒక మూల ఉన్న జైనమందిరానికి వెళ్ళి, మహావీరుడి విగ్రహానికి ప్రదక్షిణం చేసి, మూడుసార్లు సాష్టాంగపడి, "జైనులకు జయం! బ్రహ్మచర్యానికి జయం! జినుడు మమ్మల్ని రక్షించాలి! జినుడి భార్య యశోధర రక్షించాలి!" అని గట్టిగా అరిచాడు.

తరవాత వాడు జైనభిక్షువుల పెద్దను సమీపించి, సాష్టాంగ నమస్కారంచేసి, "స్వామీ, తమరు తమ అనుచరుల నందరినీ వెంటబెట్టుకుని మా ఇంటికి విందుకు ఇవాళ దయచెయ్యాలి!" అని ఆహ్వానించాడు.

దానికి పెద్ద భిక్షువు, "శ్రావకా! మమ్మల్ని విందుకు ఎందుకు ఆహ్వానిస్తున్నావు? తిండిపోతులైన బ్రాహ్మణుల మనుకున్నావా? మేం ఆహ్వానాలను పాటించం. ఆకలి అయినప్పుడు ఏ గృహస్థు ఇంటికో వెళ్ళి, వాళ్లు పెట్టినది ప్రాణం నిలుపుకునేటంత మాత్రమే తింటాం," అన్నాడు.

"మీ నియమం నాకు బోధపడింది. కాని నా అభ్యర్థన ఒకటి ఆలకించండి. మా ఇంట బోలెడన్ని వస్త్రాలు పడి ఉన్నాయి. డబ్బు మూలుగుతున్నది. అవి గ్రంథాలు తయారుచెయ్యటానికీ, దానధర్మాలు చెయ్యటానికీ మీకు ఉపయోగపడవచ్చు. మీ ఇష్టం! మీరు వద్దంటే ఇతర భిక్షువుల వద్దకు పోతాను," అన్నాడు మంగలి.

ఇది విని మందిరంలో ఉన్న ఆరుగురు భిక్షువులూ ఏకకంఠంగా, "మేం వస్తాం. నువు ఇచ్చేవి వ్యక్తి బహుమానాలు కావు గనక తీసుకోవటానికి మాకు అభ్యంతరం లేదు. నువు మరెవరివద్దకూ వెళ్ళనవసరంలేదు," అన్నారు.

చిత్రమేమంటే, బ్రహ్మచారీ, ఒంటరిగాడూ, ఇల్లు విడిచినవాడూ, సర్వం త్యజించి భిక్షాపాత్ర ధరించినవాడూ, దిగంబరత్వం అవలంబించినవాడూ అయినప్పటికీ తృష్ణ నుంచి తప్పించుకోలేడు. ఇంతకన్న చిత్రంగా వాడు తన దురాశను తెలివిగా సమర్థించుకుంటాడు. ముసలివాడై, జుట్టు నెరిసి, పళ్ళూడి, కళ్ళు మసకలు కమ్మి, చెవులు సరిగా విననిస్థితిలో ఒక్క దురాశ మాత్రమే పెరుగుతూంటుంది.

మంగలి జైన భిక్షువులను తన ఇంటి చావడిలోకి తీసుకుపోయి, తలుపులన్నీ బిగించి, బోషాణం తెరిచి, బట్టలూ, డబ్బూ బదులు మంచి దుడ్డుకర్ర పైకి తీసి, భిక్షువుల తలల మీద బలంకొద్దీ కొట్టసాగాడు. ఒక్కడు కూడా మణిభద్రుడి భిక్షువులాగా నవ్వుతూ దెబ్బలు తినక, ఒక్క దెబ్బకు చచ్చిపడి పోకపోయేసరికి మంగలికి ఆశ్చర్యమూ, కోపమూ వచ్చింది.

పై పెచ్చు ఆ జైనసన్యాసులు అరుస్తూ, దెబ్బలు తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూ ఎలుకల్లాగా చావడి అంతా తిరగసాగారు. తలుపులన్నీ బిగించి ఉండటం చేత వాళ్ళకు తప్పించుకు పారిపోయే మార్గం కనబడలేదు.



చివరకు ఇద్దరు భిక్షువులు మంగలి దెబ్బలకు పడిపోయారు. వారు చచ్చారని తెలిసి, బంగారం అవుతారేమోనని మంగలి ఆశపడ్డాడు. కాని వాళ్లు రక్తం ఓడే శవాలుగానే ఉండిపోయారు.

మిగిలిన నలుగురు భిక్షువులూ మంగలి కాళ్ళమీద పడి, "మమ్మల్ని కాపాడు! మేం నీకు ఏం చేశాం? దోచుకునేటందుకు మా వద్ద ఏమీలేదే! ఇప్పటికే ఇద్దరి ప్రాణాలు తీశావు. మిగిలిన వాళ్ళనైనా ప్రాణాలతో వదులు," అని ఆక్రోశించారు.

మంగలి ఆవేశంతో అరుస్తూ, "మీలో ఒక్కడూ బంగారం కావటంలేదు.

మీ వెధవ వేషాలుమాని. మర్యాదగా చచ్చి బంగారు విగ్రహాలుకండి,'' అంటూ వారిని మరింత ఆవేశంతో ఎడాపెడా బాధసాగాడు.

భిక్షువులు పెట్టే భయంకరమైన కేకలు విని, అటుగా వెళ్ళే రక్షకభటులు, తలుపులు బద్దలు కొట్టి, చావడిలో ప్రవేశించి, నలుగురు భిక్షువులనూ కాపాడారు. రెండు శవాలూ, నలుగురు భిక్షువులూ, మంగలీ, న్యాయాధిపతి ముందు ఉంచబడ్డారు.

న్యాయాధిపతి అంతా విని, ''ఇంత ఘోరం ఎందుకు చేశావు?'' అని మంగలిని అడిగాడు.

''నిన్న మణిభద్రుడు చేసినపనే గదా నేను చేశాను? నాది తప్పు ఎలా అయింది?'' అన్నాడు మంగలి.

''ఏమిటి నువ్వనేది?'' అని న్యాయాధిపతి అడిగాడు.

''మణిభద్రుడు నిన్న ఒక దిగంబర జైనుణ్ణి నెత్తిమీద దుడ్డుకర్రతో కొట్టగా వాడు బంగారు విగ్రహంగా మారటం నేను చూశాను,'' అంటూ మంగలి అంతా చెప్పాడు.

న్యాయాధిపతి భటులను పంపి, మణిభద్రుణ్ణి పిలిపించి, ''నిన్న నువు ఒక దిగంబర జైనుణ్ణి చంపావా?'' అని అడిగాడు.

మణిభద్రుడు తన కథ అంతా చెప్పాడు. అదివిన్నమీదట న్యాయాధిపతి, ''ఈ మూఢుణ్ణి తీసుకుపోయి ఈటెలతో పొడిచి చంపండి,'' అని ఉత్తరు విచ్చి, మంగలిని భటులు పట్టుకుపోయినాక, ''అనాలోచితంగా, విషయం సరిగా అర్థం చేసుకోకుండా పనులు చేసినవాడి గతి ఇంతే. సరిగా ఆలోచించకుండా వెనకటికి ఒక బ్రాహ్మణుడు విశ్వాసంగల ముంగిసను చేజేతులా చంపుకున్నాడు కాదా?'' అన్నాడు.

''ఏమిటా కథ?'' అని మణిభద్రుడు అడిగిన మీదట, న్యాయాధిపతి ఇలా చెప్పాడు:






## 11

[రాజు దుర్ముఖుడు అరణ్యాలు పట్టి తిరుగుతూండగా, అతడి కోటను సామంతరాజు ఆక్రమించేశాడు. తన తల భల్లూకమాంత్రికుడి పరం అయేముందు కొద్ది క్షణాలపాటైనా, తాను తిరిగి రాజు కావాలని అతడు కోరాడు. తలారి భల్లూకుడూ, ఉగ్రదండుడూ వెళ్లేసరికి, కోట లోపలినుంచి కొందరు అశ్వికులూ, సైనికులూ బయిటికి వచ్చారు. తరవాత—]

ఈటెలు పైకెత్తి పట్టుకుని వస్తున్న అశ్వికుల్నీ, వాళ్ళ పక్కనే కత్తులు దూసి నడుస్తున్న కాల్బల సైనికుల్నీ చూసి దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ భయకంపితులై పోయారు. వాళ్ళతో పాటు ఏనుగు మీద వున్న దుర్ముఖుడి సైనికులు మాత్రం ఒక క్షణకాలం నివ్వెరపోయి, ఏమి చేయటమా అని గుసగుసలు ప్రారంభించారు.

నాగమల్లు అంతలోనే తేరుకుని, తన అనుచరులతో, ''ఒరే, యింతమంది సామంతుడి సైనికులు యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా మనమీదికి వస్తారనుకో లేదు. అయినా, మనకొచ్చిన ప్రాణ భయం ఏమీలేదు, నా మాట నమ్మండి. తలారి భల్లూకుడూ, మహారాక్షసుడు ఉగ్ర దండుడూ మన వెన్నుకాచే వున్నారు.'' అన్నాడు.



''మరి, ఏనుగును వెనక్కు తిప్ప మంటావా, మల్లూ ?'' అని దొంగల్లో ఒకడు అడిగాడు.

''ఊహుఁ, అలా చేస్తే అందరి దృష్టిలో మనం ఒట్టి చవట వెధవలమైపోతాం. నేను వేసిన పథకం ఏమాత్రం పారు తుందో ప్రయత్నం చేసి చూస్తాను. వికటిస్తే మనను కాపాడేందుకు భల్లూకుడూ, రాక్షసుడూ వుండనే వున్నారు గదా,'' అన్నాడు నాగమల్లు.

''అయితే, ఆ సామంతుడి సైనికులు సమీపించకముందే ఏదో ఒకటి చేసెయ్యి,'' అని ఒక దొంగ గుసగుసలాడుతున్న సైనికులతో, ''ఒరే, ఏమిటి మీ మంత నాలు! పారిపోయి శత్రుపక్షంలో చేరాలను కుంటున్నారా ? డొక్కలు చీరేయగలను,'' అంటూ కత్తి ఎత్తాడు.

నాగమల్లు కోపంగా ఒకసారి ఏనుగు మీద వున్న సైనికు లిద్దరికేసీ చూసి, చప్పున తలపాగా విప్పి, గాలిలో రెపరెప లాడిస్తూ, తమ కేసి వస్తున్న సామంతుడి సైనికులతో, ''మిత్రుడుగా వస్తున్నాను, మీరున్న చోటనే ఆగండి! మీ రాజుగా రెక్కడ? మేం పాతరాజు దుర్ముఖుణ్ణి ప్రాణాలతో బంధించి తెచ్చాం. ఏదైనా మంచి బహుమానం యిస్తే, అతణ్ణి ఒప్ప చెప్పి, మా దారిన మేం పోతాం,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే, వాళ్ళను సమీపిస్తున్న ఆశ్వికులూ, సైనికులూ ఆగి పోయారు. ఆశ్వికుల నాయకుడు మిగతా వాళ్ళనుంచి వేరుపడి, కొంచెం ముందుకు వచ్చి, ''ఇందులో ఏదైనా మోసం లేదు గదా ? కోట గోడల మీదినుంచి మీరంతా అరణ్యం దాటి రావటం మా రాజుగారూ, మంత్రిగారూ చూస్తూనే వున్నారు,'' అన్నాడు.

''మోసం చేయదలిస్తే, పట్టపగటివేళ యింత కొద్దిమందిమి, మీ కోటకేసి రాగలమా ? మీరాక్రమించిన కోట పాత యజమాని అయిన దుర్ముఖరాజు బతికి

వుండటం, మీ రాజుకు ఏనాటికైనా ప్రమాదమే. ఆయన ఒకవేళ మాకు తగిన బహుమతి యిచ్చి, దుర్ముఖుణ్ణి కొనటం జరక్కపోతే, తిరిగి అరణ్యం లోకి పోతాం,'' అన్నాడు దొంగ నాగమల్లు.

ఆ మాటలతో అశ్వికుల నాయకుడు ఏమి చేయటమా అన్న ఆలోచనలో ఒకటి రెండు క్షణాలపాటు తల గోక్కుని, అది వీరలక్షణం కాదని గుర్తు రాగా, గట్టిగా ఖాండ్రించి, మీసం మెలితిప్పి, కత్తి పైకెత్తి, ''ఇంతకూ నీ వెవరివి? నీ పేరే మిటో చెప్పావు కాదు,'' అన్నాడు ఏమి చేయటమా అని యింకా ఆలోచిస్తూనే.



వీడేదో చురుకు తక్కువ, కొంచెం మందమతి కూడా అయివుంటాడు, అనుకుంటూ నాగమల్లు, తలపాగా గట్టిగా బిగించి, ''నా పేరు నాగమల్లు. అందరూ నన్ను నాగమల్లు దొర అంటూంటారు. అరణ్యంలో కనిపించే ఖరీదైన జంతువుల్నీ, విలువైన మనుషుల్నీ పట్టుకుని, కొనగలవాళ్ళకు అమ్ముతూండటం, నా వృత్తి,'' అన్నాడు.

''అలా చెప్పవేం! నువు చెప్పిన సంగతేదో మా రాజుగారికి విన్నవిస్తాను,'' అంటూ అశ్వికుల నాయకుడు గుర్రాన్ని వెనక్కు తిప్పబోయినవాడల్లా ఆగి, ''నీ వెనక దూరంగా గుంపు కట్టివున్న వాళ్ళల్లో రాక్షసుడిలాంటివాడూ, గొడ్డలి పట్టిన ఎలుగుబంటూ వున్నారు. వాళ్ళు నిజమైన రాక్షసుడూ, ఎలుగుబంటూ ఏనా లేక మా మంత్రిగారన్నట్టు వేషగాళ్ళా?'' అని అడిగాడు.

''ఆ సంగతి తెలియాలంటే, మీ రాజుగారే స్వయంగా యిక్కడికి రావటం మంచిది. వారి చేతి మీదుగానే బహుమతి డబ్బు తీసుకుని, పాత దుర్ముఖరాజును వారికి ఒప్పచెప్పి, రాక్షస, ఎలుగుబంటు వేషధారుల్ని వారికి పరిచయం చేస్తాను,'' అన్నాడు నాగమల్లు చిరునవ్వు నవ్వుతూ.

అశ్వికుల నాయకుడు తృప్తిగా ఓసారి తలాడించి, కత్తి పైకెత్తి సైనికులతో



"ఒరే, మీరున్న చోటునుంచి ఒక్క అడుగు ముందుగ్గాని, వెనక్కుగాని వేశారో తలలు నేల రాలగలవు. మంత్రి గారు ఊహించినట్టు వాళ్ళు వేషగాళ్ళే. నే నిప్పుడే పోయి రాజుగారికి సంగతి సందర్భాలు చెప్పి వస్తాను," అంటూ గుర్రాన్ని తెరిచివున్న కోట ద్వారం కేసి పరిగెత్తించాడు.

కోట బురుజు పక్కన నిలబడి అంతా గమనిస్తున్న సామంతుడు సూర్యభూపతీ, అతడి మంత్రి అశ్వికనాయకుడు తమ దగ్గరకు రాగానే, "శత్రువుల మీద దాడి చేయటం మాని, వాళ్ళతో మంతనాలాడుతున్నావేమిటి?" అని అడిగారు కోపంగా.

అశ్వికుల నాయకుడు వాళ్ళకు సంగతంతా చెప్పి, "ఏదో కొంత ధనం బహుమతి యిస్తే, దుర్ముఖరాజును మన పరం చేస్తామంటున్నారు, మహారాజా," అన్నాడు.

దుర్ముఖుడి పేరు వింటూనే సామంతుడు అదిరిపడి, "ఆ రాజు యింకా బతికే వున్నాడా! అరణ్యంలో ఏదో క్రూరమృగానికి ఆహారమైపోయాడని మన వేగులవాళ్ళు తెచ్చిన వార్త అబద్ధం అన్న మాట. మహామంత్రీ, నువు తక్షణం ఆ వేగులవాళ్ల తలలు తీయించెయ్యి," అన్నాడు కోపంగా.

మంత్రి విచారంగా ముఖం పెట్టి, "మహారాజా, ఆ వేగులిద్దరూ ప్రస్తుతం కోటలో లేరు, మళ్ళీ అరణ్యానికి పంపాను. మరో విషయం. దీర్ఘంగా తరిచి చూడగా, వాడు నిజమైన రాక్షసుడనీ, ఆ ఎలుగుబంటు యుద్ధవిద్యలు నేర్చినదై వుంటుందనీ అనుమానం కలుగుతున్నది. అన్నిటికంటె పెద్ద సంశయం ఏమంటే; వాళ్లు బంధించి తెచ్చామనేవాడు రాజు దుర్ముఖుడు కాకపోవచ్చని," అన్నాడు.

ఆ మాటలతో సామంతుడు సూర్యభూపతి కోపంకొద్దీ నిలువెల్లా వణికిపోతూ, "ఈ కోట ఆక్రమించిన తరవాత నిన్ను సలహాదారు పదవి నుంచి

మంత్రి పదవిలాంటి ఉన్నత స్థాయికి తేవటం నాదే పొరపాటు. ఏ సామంత రాజుకో తప్ప, రాజుకు సలహాలివ్వటానికి నువ్వు అర్హుడివి కాదు,'' అని అశ్వికనాయకుడితో, ''మహాసేనానీ! పది మందైనా లేని ఆ చచ్చు వెధవలతో మనకు రాయబారాలేమిటి? మర్యాదగా లొంగిపొమ్మని హెచ్చరించి, లొంగకపోతే చుట్టు ముట్టి పట్టుకుని, కోటలోకి ఈడ్చుకురా. బహుమానాల సంగతి తరవాత ఆలోచిద్దాం,'' అన్నాడు.

''వాడు నిజమైన రాక్షసుడైతే ప్రమాదం గద, మహారాజా!'' అన్నాడు అశ్వికనాయకుడు బొంగురు పోయిన గొంతుతో.

సూర్యభూపతి గట్టిగా ఓ మారు పళ్లు కొరికి, ''నీ వెంట వున్న సైన్యంతో ఒక్క రాక్షసుణ్ణి కాదు, నూరు మంది రాక్షసులనైనా పట్టి బంధించవచ్చు. నేనే స్వయంగా వస్తాను. ఎక్కడ నా యుద్ధాశ్వం?'' అంటూ బురుజు మీది నుంచి గబగబా కిందికి దిగాడు.

సేవకుడొకడు గుర్రాన్ని తీసుకురాగానే సూర్యభూపతి ఎగిరి దాని వీపు మీద కూర్చున్నాడు. మంత్రి అందుబాటులో వున్న మరో గుర్రాన్ని ఎక్కాడు. ముందు సామంతుడూ, పక్కలన మంత్రీ, సేనానీ



బయలుదేరి, కోట ద్వారం దాటి మైదాన ప్రదేశానికి వచ్చారు.

వాళ్ళు రావటం చూస్తూనే దొంగ నాగమల్లు పట్టలేని ఉత్సాహంతో, ''ఆహాఁ, నా పథకం పారింది! రాజైన సామంతుడూ, మంత్రీ, సేనానీ మన వలలో చిక్కబోతున్నారు,'' అన్నాడు.

''ఈ ముగ్గుర్నీ పట్టినందుకు రాజు దుర్ముఖుడు మనకేదైనా మంచి బహుమానం యిస్తాడంటావా, మల్లూ?'' అని అడిగారు దొంగలిద్దరూ.

''బహుమానం ఏమిటి? మీకు దుర్ముఖరాజుగారు ఒక సంస్థానమే ఇచ్చేస్తారు,'' అంటూ సైనికులిద్దరూ ఒరల్లో



ద్వారానికి వేళ్ళాడదీయాలో తరవాత నిర్ణ యిస్తాను,'' అన్నాడు.

సామంతరాజు ఇలా అనేసరికి, దొంగ నాగమల్లుకు తను వేసిన పథకం పారే అవకాశం లేదని తెలిసిపోయింది. వాడికి అటు దుర్ముఖరాజు మీదగాని, యిటు అతడి కోట ఆక్రమించిన సూర్యభూపతి పైన గాని ప్రత్యేకించి ద్వేషం, గౌరవ భావాలంటూ ఏమీలేవు. సూర్యభూపతి అహంకారంకొద్దీ రాక్షసుడు ఉగ్రదండుణ్ణి గాని, తలారి భల్లూకుణ్ణిగాని అవమా నించటం జరిగితే, పెద్ద రక్తపాతం జరిగి పోతుంది. అది జరగటం దొంగ నాగ మల్లుకు యిష్టం లేదు.

నుంచి కత్తులు దూయబోయి, నాగమల్లు హెచ్చరించటంతో ఆగిపోయారు.

సామంతుడు సూర్యభూపతి, నాగ మల్లు ఏనుగును సమీపించి, ''ఒరే, నువు చెప్పినదంతా, మా మహాసేనాని విన్న వించగా, చిత్తగించాను. నా రాజ్యంలో, నా కోట ముందు చేరి, మహారాజునైన నాతో బేరసారాలాడ చూస్తావా? వెంటనే పోయి, ఆ ఏనుగుల మీద వున్న దుర్ము ఖుడితో పాటు, వేషగాళ్ళను కూడా పిలుచుకురా. కోట ప్రవేశించాక, నీకూ, ఆ రాక్షస, ఎలుగుబంటి వేషాలు కట్టిన వాళ్ళకూ తగిన బహుమతు లిస్తాను. దుర్ముఖుడి తల కోట కొమ్ముకు కట్టాలో,

నాగమల్లు జవాబేమివ్వటమా అని ఆలోచించేంతలో, ఏనుగు మీద వున్న దుర్ముఖుడి సైనికులిద్దరూ చప్పున కత్తులు దూసి, "దుర్ముఖ మహారాజుకూ, జై!'' అంటూ లేచి నిలబడి, సామం తుడితో, ''ఓయ్, సూర్యభూపతీ! నీకు చావు తప్పదు. దుర్ముఖ మహారాజుకు సాయంగా వచ్చిన వాళ్లు నిజమైన రాక్షసుడూ, మంత్రశక్తులు గల తలారి భల్లూకుడూ!'' అంటూ కేకపెట్టారు.

దుర్ముఖ మహారాజుకూ, జై! అన్న కేక వింటూనే కోపోద్రేకంలో మతి పోగొట్టుకున్న సామంతుడు సూర్యభూపతి,

సైనికులు చెప్పిన తక్కిన మాటలేవీ విని పించుకోకుండా, పక్కనవున్న మంత్రి, సేనానాయకులతో, "ఈ పొగరుబోతులకూ, ఆ వెనక నిలబడి వినోదం చూస్తున్న వేషగాళ్ళకూ నా శక్తి ఎలాంటిదో తెలియజెప్పాలి. వెంటనే కొందరు అశ్వికుల్నీ, కాల్బల సైనికుల్నీ పిలిచి, వీళ్ళను తిరిగి అరణ్యంలోకి పారిపోకుండా చుట్టుముట్టమనండి," అంటూ అరిచి, కత్తి పైకెత్తి, దొంగ నాగమల్లు వున్న ఏనుగుకేసి గుర్రాన్ని ఉరికించాడు.

రానున్న ప్రమాదాన్ని క్షణంలో గుర్తించిన నాగమల్లు, చప్పున ఏనుగును అదిలించి వెనక్కు తిప్పి, ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ వున్న చోటుకు దాన్ని పరిగెత్తిస్తూ, "తలారి భల్లూక ప్రభో! నా పథకం బెడిసికొట్టింది! సామంతుడు మన మీదికి మొత్తం సైన్యాన్ని ఉసిగొల్పుతున్నాడు," అంటూ పెద్ద కేక పెట్టాడు.

రాజు అవమానించినా, తనలో రాజభక్తి కొరవడ లేదని నిరూపించేందుకు యిదే అవకాశం అనుకుంటూ మంత్రి, గుర్రాన్ని గట్టిగా కొట్టి, నాగమల్లు ఏనుగు వెనక పరిగెత్తిస్తూ, "ఒరే, దేశద్రోహులారా, ఆగండి! మీ అందరినీ సూర్యభూపతి మహారాజు శిరశ్ఛేదాలు చేయించి



గాని వదలరు!" అంటూ వెర్రిగా అరవసాగాడు.

ఈ లోపల సేనానాయకుడు దూరంగా వున్న సైన్యాన్ని ముందుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు. అంతలో ముందు మంత్రీ కొంచెం వెనకగా సామంతుడు సూర్యభూపతీ; ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ వున్న చోటు చేరారు.

తన కోట ఆక్రమించిన సూర్యభూపతిని చూస్తూనే రాజు దుర్ముఖుడు ఉగ్రుడైపోయి, కత్తి దూసి ఏనుగు మీద నిలబడి, "ఒరే, సామంతు భూపతీ! నేను పరరాజ్యాలను జయించటానికి వెళ్ళిన అదను చూసి, నా కోటనే ఆక్రమిస్తావా?

ఇదుగో, నీ తల నిలువునా నరకబోతు న్నాను," అంటూ పక్కనవున్న సైనికులు వారిస్తున్నా వినకుండా, ఏనుగు మీది నుంచి, సామంతుడి గుర్రం మీదికి దూకే ప్రయత్నంలో నేలమీద బోర్లా పడుతూనే, చప్పున లేచి నిలబడ్డాడు.

అది చూస్తూనే తలారి భల్లూకుడు గట్టిగా చప్పట్లు చరుస్తూ, "ఆహా, ఏమి సాహసం! అరణ్యంలో చిరుతపులిని ఎదిరించి నిలబడలేని రాజు దుర్ముఖుడు, యిప్పుడు తన కోట కంటబడి, సింహాసనం గుర్తుకు రాగానే, శత్రువుల మీదికి ఉరికించి దూకుతున్నాడు," అన్నాడు.

తన శత్రువు కిందపడటం చూస్తూనే, సామంతుడు, "ఆహా, వ్రణశేషం, శత్రుశేషం ప్రాణాపాయకరం అన్నారు, పెద్దలు. ఇదె, నీ తల తెగిపడబోతున్నది!" అంటూ కత్తి చాచి, దుర్ముఖుడి కేసి గుర్రాన్ని దూకించాడు.

అదే సమయంలో ఏనుగు మీద తలారి భల్లూకుడి ముందు కూర్చునివున్న ఆటవికుడు బాణం ఎక్కుపెట్టి, "తలారి భల్లూకయ్యకూ, జే!" అంటూ సామంతుడి కేసి వదిలాడు. బాణం గురి తప్పి సామంతు డెక్కివున్న గుర్రం నుదుట గుచ్చుకున్నది. గుర్రం పెద్దగా సకిలిస్తూ వెనక కాళ్ళ మీద లేచింది.

సామంతు సూర్యభూపతి కింద పడబోయిన వాడల్లా, కళ్ళాలు గట్టిగా పట్టుకుని ప్రమాదం తప్పించుకున్నాడు. ఈ లోపల దుర్ముఖుడు, మంత్రిని ఒక్క పిడికిలిపోటుతో గుర్రం మీదినుంచి కిందికి పడగొట్టి, అతడి గుర్రాన్ని ఎక్కి, సామంతుడి కేసి పరిగెత్తించాడు.

తాను శత్రువుల మధ్య చిక్కుకుపోయానని గ్రహించిన సామంతుడు, గుర్రాన్ని కోటకేసి పరిగెత్తిస్తూ, సైనికులను హెచ్చరించసాగాడు. రాజు దుర్ముఖుడు గుర్రాన్ని గట్టిగా అదిలించి, కత్తి పైకెత్తి, "ఒరే, సామంతు భూపతీ, పిరికిపందా, ఆగు! ఆగు!" అంటూ వెంటబడ్డాడు. —(ఇంకావుంది)






# మానవత్వం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ ప్రపంచంలో నేరానికి శిక్ష ఉండదు. అందుకు నిదర్శనంగా నీకు గంగు అనే పగటి దొంగ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకప్పుడు కాంచీపురం అనే నగరంలో ఒక పగటి దొంగ బయలుదేరి, అతి చాకచాక్యంతో దొంగతనాలు చేయసాగాడు. పట్టపగలు బేరం జరుగుతున్న దుకాణాలలో కొనవచ్చినవారి డబ్బూ, దుకాణదారు డబ్బూ మాయమయేది. ఇలాటి దొంగతనాలే సత్రాలలో కూడా జరిగేవి. దొంగను చూసినవారు లేరు. డబ్బు

## బేతాళ కథలు



పోగొట్టుకున్నవాళ్ళు కూడా తమ డబ్బు ఎప్పుడు, ఎక్కడ పోయినదీ చెప్పలేని స్థితిలో ఉండేవాళ్లు. రైతులూ, వర్తకులూ, రాజోద్యోగులూ ఈ పగటిదోపిడీకి గురి అయేవాళ్ళు. ఇంట్లో ఉన్నప్పుడు వారి సొత్తుకు ఎలాటి ప్రమాదమూ ఉండేదికాదు.

ఈ దొంగతనాలను గురించి నగర పాలకుడికి ఎన్నో ఫిర్యాదులు వెళ్ళాయి. అతను దొంగ ఆచూకీ తెలుసుకోవటానికి చారులను నియమించాడు. కాని లాభం లేకపోయింది. ఆ దొంగ పేరు గంగు. అతన్ని చూసి దొంగ అని ఎవరూ అనుకోలేరు. అతని హస్తలాఘవం అత్యద్భుతం.

గంగును అధికారులు పట్టలేకపోవటానికి కారణం అతను మామూలు దొంగ కాడు. మామూలు దొంగలు దొంగతనాలు చేసే పరిస్థితులలో అతను దొంగతనాలు చేయడు. అతని చేత దోచుకోబడేవారు అతన్ని చూసి దొంగ అనుకోరు. గంగును పట్టాలంటే ఈ విషయాలు గమనించాలి!

ఒకసారి గంగు నడివీధిలో ఒక వ్యక్తి నుంచి డబ్బు సంచీ తస్కరించాడు. అందులో డబ్బుతో బాటు ఒక ఉత్తరం కూడా ఉన్నది. అది ఒక స్త్రీ రాసిన ఉత్తరం. తన భర్త చావుబ్రతుకులలో ఉన్నాడనీ, చికిత్సకు డబ్బు అవసరమనీ, దాన్ని వెంటనే పంపి, తన పసుపు కుంకాలు నిలబెట్టమనీ ఆ స్త్రీ తన అన్నకు హృదయ విదారకంగా రాసింది.

ఆ లేఖ చదివిన మీదట గంగుకు కంపరం పుట్టింది. అతను తాను దొంగిలించిన డబ్బు తీసుకుని, లేఖ వ్రాసిన స్త్రీ ఇంటికి వెళ్లాడు. అతను ఇంట్లోకి అడుగు పెట్టగానే రక్షకభటులు అతన్ని చుట్టుముట్టి పట్టుకున్నారు. అదే సమయంలో, గంగు ఏ వ్యక్తి దగ్గిర సంచి తస్కరించాడో ఆ వ్యక్తి లోపలినుంచి వచ్చాడు. అతను మారువేషంలో ఉండిన నగరపాలకుడే! పగటి దొంగను పట్టుకునేందుకు ఆయన నెల రోజులుగా

డబ్బు సంచీతో మారువేషంలో తిరుగుతున్నాడు. ఇంత కాలానికి అతని ఎత్తు పారింది. పగటి దొంగ దొరికిపోయాడు.

న్యాయస్థానంలో గంగు విచారణ జరిగింది. అతనే పగటి దొంగ అని రుజువయింది. కాని నగరపాలకుడు గంగును శిక్షించలేదు; ఇక ముందు దొంగతనాలు చేయనని గంగు చేత ప్రమాణం చేయించి, అతన్ని వదిలేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నగరపాలకుడు అంత శ్రమపడి పగటి దొంగను పట్టి కూడా, శిక్షించకుండా ఎందుకు విడిచిపెట్టాడు? పగటి దొంగను శిక్షించే ఉద్దేశం లేకపోతే అతన్ని పట్టుకోవటమూ, విచారించటమూ దేనికి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పగటి దొంగ పట్టుబడటంలో నగరపాలకుడు పడిన శ్రమ ఏమీలేదు. దొంగ ఎంతో మానవత్వంగలవాడైతే తప్ప నగరపాలకుడి ఎత్తు పారే అవకాశంలేదు. మానవత్వం కలిగిన కారణంగా దొంగ దొరికిపోతే అతన్ని తీవ్రంగా శిక్షించటం సాధ్యంకాదు. నగరపాలకుడు గంగుకు స్వల్ప శిక్ష అయినా వెయ్యకపోవటానికీ, అతని విచారణ బహిరంగంగా జరపటానికీ తగిన కారణం ఉన్నది. గంగు ఎలా ఉంటాడో కూడా ఎవరికీ తెలియదు. అతని ముఖం పదిమందికీ తెలిసిన తరవాత అతను పగటి దొంగతనాలు చెయ్యటం సాధ్యంకాదు. ఇతనే పగటి దొంగ అని అందరికీ తెలియగలందులకు నగర పాలకుడు బహిరంగ విచారణ జరిపాడు. అతను ఎవరో అందరికీ తెలిసినాక అతను దొంగతనాలు చెయ్యడం సాధ్యంకాదు గనక అతన్ని శిక్షించకుండా వదిలేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఉద్యోగార్హత

కాంభోజదేశపు మహామంత్రి సుమంత్రుడు గొప్ప మేధావి. తన తరవాత తన స్థానంలో పని చెయ్యటానికి సమర్థుణ్ణి తానే ఎన్నుకుని, తరిఫీదు ఇయ్యటం మంచిదని ఆయనకు తోచింది. ఆయన ఉద్యోగశిక్షణకు అభ్యర్థులు కావాలని చాటింపు వేయించి, తన కార్యాలయం తాత్కాలికంగా నగరానికి యోజనం దూరంలో ఒక డేరాలో ఏర్పాటు చేశాడు. అక్కడ ఆయనను చూడటానికి చాలామంది యువకులు వచ్చారు. సుమంతుడు వారిలో ఇద్దరిని ఎన్నుకున్నాడు. వారి కిద్దరికీ ఆఖరు పరీక్ష పెట్టదలచి, ఆయన వారితో, "మీరు చాలా అపాయకరమైన బాధ్యత నిర్వర్తించాలి. ఈ వుత్తరాన్ని నగం దూరం ఒకరూ, మిగిలిన దూరం ఇంకొకరూ తీసుకుని, రాజదర్బారుకు వెళ్ళి, రాజుగారికి అందేలాగ చూడాలి. ఉత్తరాన్ని చదవరాదు," అన్నాడు.

ధర్మదత్తుడూ, సుమిత్రుడూ ఉత్తరంతో బయలుదేరారు. మొదటి నగం దూరం ఉత్తరాన్ని తనవద్ద వుంచుకున్న సుమిత్రుడు దాన్ని తీసి చదివి, హడలిపోయి, దాన్ని ధర్మదత్తుడి కిచ్చి తాను ఎటో పారిపోయాడు. ధర్మదత్తుడు రాజసభ చేరి, ఉత్తరాన్ని ఆస్థాన విదూషకుడికి ఇచ్చి, రాజుగారికి అందజేశాడు. అందులో "ఈ ఉత్తరాన్ని మీకు అందించినవాణ్ణి ఉరి తీయించండి—సుమంతుడు" అని వున్నది.

రాజు ధర్మదత్తుణ్ణి ఉరి తీయమని ఆజ్ఞ ఇచ్చాడు.

"మహారాజా, మీకు ఉత్తరం అందించినవాడు విదూషకుడు. నా కెందుకు ఉరిశిక్ష?" అని అడిగాడు ధర్మదత్తుడు.

సుమంతుడు ధర్మదత్తుణ్ణి భావిమంత్రిగా ఎన్నుకున్నాడు.

—కొండపనేని మురళీమోహన్





# గుణం

రాఘవయ్య అనే జమీందారు దగ్గిర చంద్రయ్య అనే కుర్రవాడు కొత్తగా పాలేరు పనికి చేరాడు. రాఘవయ్య ముక్కోపి అనీ, క్రూర స్వభావుడనీ చంద్రయ్యకు ముందే తెలుసు. కాని చంద్రయ్య రాఘవయ్యను అసహ్య పడ లేదు. పనిలో చేరటానికి సంకోచించలేదు. రాఘవయ్య దగ్గిర పనిచేసే ఇతర పాలేరు కుర్రాళ్లు వద్దని సలహా ఇచ్చినా చంద్రయ్య వినిపించుకోలేదు.

చంద్రయ్య పనిలో చేరినప్పటినుంచీ రాఘవయ్య సాధింపులూ, చీదరింపులూ ప్రారంభమయాయి. రాఘవయ్య చంద్రయ్యని కూర్చుని కూడు తిననిచ్చే వాడు కాడు, నిలబడి నీళ్లు తాగనిచ్చేవాడు కాడు. అన్నం తింటున్న చంద్రయ్యను ఏదో పని చెప్పి, అన్నం ముందునుంచి లేవగొట్టేవాడు రాఘవయ్య. చంద్రయ్య నవ్వుతూ లేచిపోయెవాడు. అర్ధరాత్రి వేళ కూడా రాఘవయ్య చంద్రయ్యను లేపి ఏదో పని చెప్పేవాడు.

దొడ్లో గేదె పాలు ఇయ్యకపోతే రాఘవయ్య చంద్రయ్యను తిట్టేవాడు. ఒకసారి పొలంలో ఆకుమడి ఒక మూల మాడిపోయిందని, రాఘవయ్య అర్థం లేకుండా చంద్రయ్యను కొట్టాడు. అలాగే ఇంకోసారి ఇంటి కోళ్ళను గండుపిల్లి పీక కొరికిపోతే, చంద్రయ్య దెబ్బలు తిన్నాడు.

ఇలా రాఘవయ్య ఎన్ని చేసినా చంద్రయ్య నవ్వుతూ భరించేవాడేగాని, ఎన్నడూ తిరస్కారం చూపలేదు. చంద్రయ్య ఎందుకు సహించి పడి ఉంటాడా అని రాఘవయ్య ఏనాడూ ఆలోచించలేదు.

రాఘవయ్య చంద్రయ్యను పెట్టుతున్న బాధలకు కుమిలిపోయిన మనిషి

జి. నరసింహమూర్తి

రాఘవయ్య భార్య. అలాటి రాక్షసుడితో ఆమె ఇన్ని ఏళ్ళూ కాపరం చేస్తూ వస్తున్నది. భార్య కావటంచేత ఆమెకు తప్పదు. లోగడ కొందరు పాలేర్లు రాఘవయ్యతో వేగినన్నాళ్ళు వేగి, వేగలేనప్పుడు తమ జీతం డబ్బులు తీసుకుని వెళ్ళిపోయారు. చంద్రయ్య కూడా అలాగే చేస్తాడేమోనని ఆమె అనుకున్నది. కాని చంద్రయ్య అలా చెయ్యలేదు. వాడికి తాను బాధలు పడుతున్నానని కూడా తెలిసినట్టు ఆమెకు కనిపించలేదు. చంద్రయ్య ఉత్సాహంగా ఇంట్లో పనులన్నీ చెయ్యటమేగాక, పొలం పనులు కూడా చేస్తున్నాడు. వాడి పని శ్రద్ధ చూసిన వాళ్లకు, రాఘవయ్య వాణ్ణి అంత క్రూరంగా ఎందుకు చూస్తున్నాడా అనిపించేది.

చూసి, చూసి, రాఘవయ్య భార్యే ఒకనాడు తెగించి, చంద్రయ్యను చాటుగా పిలిచి, "ఒరే, నీ వంటి మంచివాణ్ణి నీ యజమాని నానాశ్రమలూ పెట్టుతూ, అనవసరంగా తిట్టుతున్నాడు, కొట్టుతున్నాడు! ఎందుకు భరిస్తావు? నీకు నీ జీతంతోబాటు కొంత డబ్బు అదనంగా ఇస్తాను, ఎక్కడికైనా వెళ్లి హాయిగా బ్రతుకు," అన్నది జాలిపడుతూ.

"అదేమిటి, అమ్మగారూ? మీరు నా తల్లిలాటివారు. అయ్యగారు తండ్రిలాటివారు. నన్ను ఏమన్నా ఆయనకు నా మీద ప్రేమ ఉంటుంది. నా మీద ఆయనకు కోపం ఎందుకుంటుందీ? నా మేలు కోరే ఏమైనా చేస్తారు. మీకు సేవ చేస్తూ బతికితే నాకు అదే చాలు," అన్నాడు చంద్రయ్య.

ఈ మాటలు చాటున నిలబడి విన్న రాఘవయ్యకు తనను ఎవరో శూలంతో పొడిచినట్టయింది. తన కొడుకు కూడా తనపట్ల చూపని విశ్వాసం చంద్రయ్య చూపాడు. ఆ క్షణంనుంచీ రాఘవయ్య చంద్రయ్యను తన కొడుకులాగా చూడటమే గాక, తన ముక్కోపమూ, చిరాకూ విడిచిపెట్టి, అందరితోనూ ఎంతో మంచిగా ప్రవర్తించసాగాడు.





# నమ్మకస్థుడు

భద్రయ్య గల్లాపెట్టె దగ్గిర కూర్చుని డబ్బు లెక్కపెట్టుకుంటూండగా, అతడి భార్య లక్ష్మి వచ్చి, "ఇంకా మన మేకలు తిరిగి రాలేదు. కొత్త పనికుర్రాణ్ణి నమ్మి వాడి వెంట మేకల్ని పంపాం. వాడు వాటిని ఇంటికి తోలుకు రాకపోతే ఏం చేసేట్టు?" అన్నది.

భద్రయ్య తన మేకలను కాయటానికి ఒక కుర్రవాడి కోసం చూస్తూంటే, అతని స్నేహితుడు రామదాసు గోపీ అనే కుర్రవాణ్ణి శిఫార్సు చేసి, పనిలో పెట్టుకోమని పంపించాడు. వాడు ఆ రోజే మొదటిసారిగా మేకలను తోలుకుని వెళ్ళాడు. మేకలు తిరిగి వచ్చే వేళ అయింధి. కాని గోపీ జాడ లేదు.

"కుర్రాడు నమ్మకస్తుడు కాకపోతే నా స్నేహితుడు రామదాసు వాణ్ణి పంపిస్తాడా? మరేం భయంలేదు. నీ పని చూసుకో." అని భద్రయ్య భార్యను పంపేశాడు.

కాని అతనిలో భయం కలగక పోలేదు. అవును! ఈ మేకలతో పాటు పనికుర్రాడు పారిపోతే తాను చేయగలిగినది ఏమీలేదు.

భద్రయ్య తన పని పూర్తి చేసుకుని, వీధి అరుగుమీదికి చేరేసరికి పనికుర్రాడు మేకలతో సహా తిరిగి వచ్చాడు. భద్రయ్య మనస్సూ, లక్ష్మి మనస్సూ కుదటపడింది.

పనికుర్రాడు గోపీ అమాయకపు మొహం చూస్తే నమ్మకస్తుడిలాగే కనిపిస్తాడు. కాని, ఎందుకైనా మంచిది, వాణ్ణి పరీక్షించాలనుకున్నాడు భద్రయ్య. రెండు, మూడు రోజులపాటు గోపీ కంట పడేలాగా చిల్లర డబ్బు భద్రయ్య ఇంట్లో అక్కడక్కడా పడేశాడు. గోపీ వాటిలో

గుండాల విజయ

ఒక్కటైనా ఉంచుకోకుండా, అన్నీ తీసి భద్రయ్యకు ఇచ్చేశాడు. దాంతో భద్రయ్యకు గోపీ మీద మరికొంత నమ్మకం ఏర్పడింది.

"గోపీని అనవసరంగా అనుమానించకు. వాడు చాలా మంచివాడు," అని భద్రయ్య తన మనసులో ఏ అనుమానమూ ఎన్నడూ కలగనట్టుగా తన భార్యకు చెప్పాడు.

"మొదట్లో అందరూ మంచిగానే ఉంటారు. నాలుగు రోజులు పోతేగాని అసలు రంగు బయటపడదు," అన్నది లక్ష్మి భర్తతో.

ఆఖరుసారిగా గోపీని పరీక్షించాలని తలచి, భద్రయ్య తనకు స్నేహితుడైన ఒక ముసల్మానుకు కొంత డబ్బిచ్చి, ఏదో చెప్పి పంపాడు.

ఆ ముసల్మాను మిత్రుడు, మేకలను అడవిలో కాస్తున్న గోపీ వద్దకు వెళ్ళి, "అబ్బాయీ, పది రూపాయలిస్తాను. నాకొక మేకను ఇస్తావా?" అని అడిగాడు.

"ఇవి నావి కావు బాబూ, మా యజమానిగారి దగ్గిరికి వెళ్ళి కొనుక్కోండి" అన్నాడు గోపీ.

ముసల్మాను బేరం పెంచి, చిట్ట చివరకు ఒక మేకకు నూరు రూపాయలు ఇస్తానన్నాడు.

గోపీ కొంచెం ఆలోచించి, "సరే అయ్యండి," అని నూరు రూపాయలు తీసుకుని, ముసల్మానుకు మందలో నుంచి ఒక మేకను ఇచ్చేశాడు.

సాయంత్రం గోపీ మేకలను ఇంటికి తోలుకుపోతూనే భద్రయ్య దగ్గిరికి వెళ్ళి, "బాబూ, ఒక తెలివిలేని సాయిబు నూరు రూపాయలిచ్చి మన మేకను ఒకదాన్ని కొన్నాడు. ఇదుగో డబ్బు. దానితో మనకు మూడు మేకలు వస్తాయి గదా అని అమ్మేశాను," అంటూ డబ్బు భద్రయ్య చేతిలో పెట్టాడు.

అటు తరవాత భద్రయ్యగాని, లక్ష్మిగాని గోపీని ఏనాడూ అనుమానించటం జరగలేదు.



# దేవుడికి టోకరా!

ఒక ఊళ్ళో వీరయ్య అనే వ్యాపారస్తుడుండేవాడు. అతను రోజూ అంగడి మూసేటప్పుడు డబ్బంతా గల్లాపెట్టెలో పెట్టి, అందులో డబ్బు ఎవరూ తియకుండా ఉంటే దేవుడికి ఒక కొబ్బరికాయ కొట్టుతానని మొక్కుకునేవాడు.

ఇలా నెల రోజులు గడిచినా వీరయ్య దేవుడికి ఒక్క కొబ్బరికాయ కూడా కొట్టలేదు. అప్పుడు దేవుడు వీరయ్యకు కలలో కనబడి, "ఇన్నాళ్ళు గడిచాయి. నీ డబ్బు జాగ్రత్తగా చూస్తున్నాను. ఒక్క కొబ్బరికాయ కూడా కొట్టావుకావేం?" అని అడిగాడు.

"ఎలాగండీ మరీ? కొబ్బరికాయ కొట్టాలంటే కొనాలి గదా? కొనాలంటే గల్లాపెట్టెనుంచి డబ్బు తియాలిగదా? గల్లాపెట్టెలో డబ్బు పోకుండా ఉండటానికే గదా కొబ్బరికాయ కొట్టుతానన్నానూ!" అన్నాడు వీరయ్య.

దేవుడీ మాటకు ఆశ్చర్యపోయి, అదృశ్యమయాడు. —డి. శ్రీధరరెడ్డి





# ఏది ధైర్యం?

చంప తల్లి లేని పిల్ల. తండ్రి గారాబంతో ఆమె స్వేచ్ఛగా పెరిగింది. ఆమెది మొండి ధైర్యం; నిర్లక్ష్యంగానూ, సాహసంగానూ ప్రవర్తించేది. ఒంటరిగా చీకట్లో వెళ్ళిపోయేది. గాలి రావడం లేదని, పెరటివాకిలి బార్లా తెరిచి పడుకునేది. ఊరి చివర ఉన్న గుడికి వెళ్ళి, పొద్దుపోయి తిరిగి వచ్చేది. ఎవరినీ లక్ష్యపెట్టక, ఎంతటి వాళ్ళతోనైనా నోటికి వచ్చినట్టు మాట్లాడేది.

చంపకు పెళ్ళి ఈడు దగ్గిర పడుతున్న కొద్దీ ఆమె తండ్రి రాజయ్యకు, ఆమె ప్రవర్తన ఒక సమస్య అయింది. ఆమె చూపే దుస్సాహసం ప్రమాదకరమని ఆయన ఎన్నోసార్లు చెప్పి చూశాడుగాని, చంప నవ్వి ఊరుకునేది.

చంపకు పెళ్ళి సంబంధం చూసే పని మీద రాజయ్య పొరుగూరు పోతూ, "అమ్మా, రాత్రి ఇల్లు జాగ్రత్త! ఇంట్లో ఒక్కత్తెవే ఉంటావు," అని మరీ మరీ హెచ్చరించాడు.

"నాన్నా, నాకు చీటికీ, మాటికీ ఎందుకిలా పిరికి మందు పోస్తావు? ఏమీ భయంలేదు! నువు నిశ్చింతగా వెళ్ళిరా," అన్నది చంప చిరాకు పడుతూ.

ఎందుకయినా మంచిదని, రాజయ్య ఇంట్లో ఉన్న డబ్బూ, నగలూ మూటగట్టి, అటక మీద పాత బట్టలో చుట్టిపెట్టి, వెళ్ళిపోయాడు. తండ్రి జాగ్రత్తను వేళాకోళం పట్టిస్తూ, చంప తలుపు మూసుకున్నది. తరవాత ఆమె భోజనం చేసి, వంటిల్లు సర్ది, నిద్ర వచ్చేదాకా పెరట్లో పచార్లు చేసి వచ్చి పడుకున్నది.

ఆమెకు కునుకు పట్టుతూండగా పెరటి తలుపు మీద ఎవరో దడదడా బాదారు. చంప లేచి వెళ్ళి తలుపు తెరిచి, బయట

మాచిరాజు కామేశ్వరరావు

ఒక పాతిక ఏళ్ళ యువకుడు నిలబడి ఉండడం చూసింది.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అని ఆమె అతన్ని అడిగింది.

అతను చప్పున లోపలికి వచ్చి, పెరటి తలుపు మూసి, కత్తి చూపించి, "మర్యాదగా ఇంట్లో ఉన్న నగలూ, డబ్బూ ఇచ్చెయ్యి," అన్నాడు.

చంప ఈ హఠాత్సంఘటనకు నిర్ఘాంతపోయి, నోరు మెదపలేకపోయింది.

దొంగ తన కత్తిని ఆమె మెడకు ఆనించి, "వెర్రి వేషాలు వెయ్యక, చెప్పిన పని చెయ్యి," అన్నాడు.

"మా యింటో డబ్బు ఎక్కడిది? ఉన్నదంతా మా నాన్న పెళ్ళివారికి ఇచ్చి రావడానికి వెళ్ళాడు," అన్నది చంప సమయస్ఫూర్తితో. దొంగ ఆమె మాటలు నమ్మక, పెట్టెలన్నీ తెరిపించి చూశాడు. ఎక్కడా చిల్లిగవ్వ కూడా లేదు.

దొంగ కోపంగా చంప మెడలోని గొలుసును గట్టిగా తెంపేసి, పెరటి వాకిలి బయటినుంచి మూసి, పారిపోయాడు. వాడు తెంపుకుపోయిన గొలుసు ఇటీవలే రాజయ్య చంపకు జరగనున్న పెళ్ళి సందర్భంగా, బోలెడంత డబ్బు పోసి, చేయించాడు.

మర్నాడు తండ్రి రాగానే ఆమె అతనికి జరిగినదంతా చెప్పింది.

"ఇప్పుడు విచారించి ఏం లాభం? ధైర్యమంటే తెలివితక్కువతనం కాదు.



అర్ధరాత్రి ఎవరో తలుపు తట్టితే, ఒంటరిగా ఉన్న ఆడపిల్ల తలుపు తెరిచెయ్యటం ధైర్యం కాదు, తెలివిమాలినతనం! అలాగే, భయానికీ, జాగ్రత్తకీ తేడా ఉన్నది. డబ్బు దాచుకోవటమూ, రాత్రి తలుపులు మూసుకోవటమూ, చీకట్లో దీపం పట్టుకుపోవటమూ భయం కాదు, జాగ్రత్త! ధైర్యమంటే అనుకోని సమస్య గానీ, ప్రమాదంగానీ తటస్థపడితే, దాన్ని గుండె నిబ్బరంతో ఎదుర్కోవడం. అలాటి పరిస్థితిలో ఏమీ చెయ్యలేక దిగజారి పోవడం భయం. ఇప్పటికైనా ఈ తేడా తెలుసుకుంటే 'మంచిది,'' అన్నాడు రాజయ్య.

చంప తన తెలివితక్కువతనాన్నీ, అజాగ్రత్తనూ క్రమంగా జయించింది.

ఇది జరిగిన ఒక మాసానికి చంపకు పెళ్ళిచూపులు జరిగాయి. పెళ్లికొడుకు తల్లి చంప తనకు నచ్చిందని చెప్పి, ప్రధానం కింద ఆమె మెళ్లో ఒక గొలుసు తగిలించింది. దాన్ని చూసి చంప అదిరి పడింది. అది తన మెడనుంచి దొంగ కాజేసిన గొలుసే!

ఆమె తల ఎత్తి పెళ్లికొడుకును చూసి, మరింత అదిరిపడింది. అతనే తన గొలుసు కాజేసిన దొంగ!

ఆమె చరచరా లోపలికి వెళ్లిపోయి, "నా గొలుసు కాజేసిన దొంగ ఆ పెళ్లి కొడుకే! చచ్చినా ఈ పెళ్లికి ఒప్పుకోను,'' అని తండ్రితో అన్నది ఆవేశంగా.

రాజయ్య నవ్వి, "నువు మళ్లీ నీ తెలివి తక్కువతనాన్ని వెళ్లబెట్టుకుంటున్నావు! నిజానిజాలు తెలుసుకోకుండా మాట అనెయ్యడం ధైర్యం అనిపించుకోదు. అతను నిన్ను గుడిలో చాలాసార్లు చూసి, పెళ్లి చేసుకుందామనుకున్నాడు. అయితే నీలో ఉన్న లోపం సరిదిద్దటానికి దొంగాట ఆడాడు. నువు మారినట్టు తెలుసుకుని పెళ్లిచూపులకు వాళ్ల అమ్మను తెచ్చాడు,'' అన్నాడు.

చంప వల్లమాలిన సిగ్గుతో తల దించుకున్నది.





# గౌతముడు

బ్రహ్మదేవుడు ఒక అపురూప లావణ్యవతి అయిన అహల్యను సృష్టించి, భూప్రదక్షిణం ముందుగా ఎవరు చేసి వస్తే వారికి ఆమెను భార్యగా ఇస్తానన్నాడు. అహల్యను భార్యగా చేసుకోవాలని అనేక మంది దేవతలు భూప్రదక్షిణం చెయ్యటానికి బయలుదేరిపోయారు. అప్పుడు గౌతముడు అనే ముని, ఈనుతున్న ఆవు చుట్టూ ప్రదక్షిణం చేసి, బ్రహ్మ వద్దకు వెళ్ళి, తాను చేసిన గోప్రదక్షిణం భూప్రదక్షిణానికి సమమని బ్రహ్మను ఒప్పించి, అహల్యను పెళ్ళాడాడు.

అహల్య వల్ల గౌతముడికి శతానీకుడనే కొడుకు కలిగాడు.

ఇంద్రుడు అహల్యను మోహించి, అర్ధరాత్రివేళ కోడిలాగా కూశాడు. గౌతముడు తెల్లవారవస్తున్నదని కాలకృత్యాలు తీర్చుకోవటానికి బయటికి వెళ్ళాడు. అప్పుడు ఇంద్రుడు గౌతముడి ఇంట జొరబడి, అహల్యతో గడిపాడు. అది తెలిసి గౌతముడు ఇంద్రుణ్ణీ, అహల్యనూ కూడా శపించాడు.

గౌతముడు విత్తనాలు చల్లగానే అప్పటికప్పుడు మొలకలెత్తి, మొక్కలు పెరిగి, పంట పండేది. ఇలా గౌతముడికి బ్రహ్మ వరం ఇచ్చాడు.

ఒకసారి విపరీతమైన కరువు రాగా, మునులందరూ గౌతముడి ఆశ్రమానికి వచ్చారు. గౌతముడు అందరికీ భోజనం పెట్టుతూ వచ్చాడు. అతనికి గల సంపదను చూసి మునులు ఈర్ష్యపడి, ఒక మాయ గోవును సృష్టించి, దాన్ని అతని పొలం మీదికి తోలి, "నీ పొలాన్ని ఆవు మేసేస్తున్నది," అన్నారు గౌతముడితో.

గౌతముడు ఆ గోవును నోటితో అదిలిస్తూ, చేతిలో ఉన్న నీరు దాని మీద

విసిరాడు. ఆ నీరు రెండు చుక్కలు తగలగానే ఆ మాయ గోవు చచ్చిపడి పోయింది.

"ఛీ, ఛీ! గోహత్య చేసినవాడి ఇంట భోజనం చెయ్యరాదు. పోదాం!" అని మునులు లేచారు.

గౌతముడు వారిని వేడుకుంటూ, "గోవును చంపిన పాపం ఎలా పోతుంది?" అని అడిగాడు.

"గోవు శవం పడిన ప్రదేశం మీదుగా గంగ ప్రవహిస్తే నీ పాపం పోతుంది." అన్నారు మునులు.

గంగను తన పొలం మీదుగా ప్రవహింపజెయ్యటానికి గౌతముడు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. కొన్నాళ్ళకు శివుడు ప్రత్యక్షమై, తన జటను ఒక దాన్ని గౌతముడికి ఇచ్చి, దాన్ని పిండమని చెప్పాడు.

గౌతముడు శివుడి జటను తీసుకుపోయి గోవుకళేబరం మీద పిండేసరికి, గోవు బతికి లేచి, ఆడదాని రూపంతో అక్కడినుంచి వెళ్ళిపోయింది. అక్కడ నది ప్రవహించింది. ఆ నది గౌతముడు తెచ్చినది గనక దానికి గౌతమి అనీ, గోవును బతికించినది కావటంచేత గోదావరి అనీ ప్రసిద్ధిపొందింది.

ఒకసారి గౌతముడు బ్రహ్మదత్తు డనే రాజు ఇంటికి వెళ్ళి, భోజనం పెట్టమని అడిగాడు. ఆ రాజు గౌతముడికి ఏళ్ళ తరబడి భోజనం పెట్టాడు. ఒక రోజు భోజనంలో మాంసం వచ్చింది. గౌతముడు రాజును గద్దవు కమ్మని శపించాడు. రాజు క్షమాపణ చెప్పుకున్న మీదట, "నిన్ను రాముడు తాకుతాడు. అప్పుడు నీకు గద్ద రూపం పోతుంది." అని గౌతముడు చెప్పాడు.

గౌతముడు న్యాయసూత్రాలు రచించాడు. వ్యాసుడు వాటిని నిందించాడు. గౌతముడు వ్యాసుణ్ణి తన కళ్ళతో చూడనని ప్రతిజ్ఞ చేసి, అరికాలిలో కన్ను కల్పించుకుని దానితో వ్యాసుణ్ణి చూశాడట!





# ఇంటు చేరిన శత్రువు

సుమేరు పర్వతం మీద వజ్రనాభుడు అనే దానవుడు బ్రహ్మను గురించి తీవ్ర తపస్సు చేసి మెప్పించి, దేవతలవల్ల తనకు చావులేకుండా వరంపొందాడు.



వజ్రనాభుడు దేవతలకు అజేయుడైన విధంగానే వజ్రపురం అనే అతని కోట దుర్భేద్యమైనది. అందులోకి అతని అనుమతి లేకుండా వాయువుకూడా చొరలేదు.



వరగర్వంతో వజ్రనాభుడు ఒక్కొక్క రాజునే యుద్ధంలో జయించి, ఒక్కొక్క రాజ్యాన్నీ నిర్మూలించి, లోకమంతటా ప్రజల ఆక్రందనలు చెలరేగ జేశాడు.



భూలోకాన్ని జయించటంతో వజ్రనాభుడు తృప్తి చెందక, దేవతలభయం లేనివాడు కావటంచేత స్వర్గం మీదికి దండెత్తాడు.



తనతో యుద్ధానికి రమ్మనీ, లేదా తనకు లొంగి పొమ్మనీ వజ్రనాభుడు ఇంద్రుడికి కబురుపంపాడు. ఏమి చెయ్యటానికీ ఇంద్రుడికి పాలుపోలేదు.



దేవతలు వితర్కించుకుని, యుద్ధంలో తాము జయించటం సాధ్యంకాదు గనక అతని దుర్గాన్ని రహస్యంగా ప్రవేశించి, ధ్వంసం చేతామనుకున్నారు. కాని వజ్రపురి దుర్భేద్యం.



వజ్రనాభుణ్ణి దేవతలు చంపలేరు. గాని మనుషులు చంపవచ్చు! ద్వారకలో కృష్ణుడి కొడుకైన ప్రద్యుమ్నుణ్ణి అందుకు ఉపయోగించ వచ్చునని ఇంద్రుడు ఆలోచించాడు.

వజ్రనాభుడి కూతురు ప్రభావతి గొప్ప సౌందర్యవతి. వజ్రనాభుడికి ఆమె అంటే పంచప్రాణాలు. ఆమె మంచి నర్తకి.





ఒకనాడు ప్రభావతి క్రీడాసరోవరం వద్ద కూర్చుని ఉండగా, ఇంద్రుడు పంపిన రాజహంసలు కొన్ని వచ్చి ఆమె సమీపంలో వాలాయి. అవి ప్రభావతిని ఆకర్షించాయి.



ఆ హంసలు తమలో తాము, "ఈ ప్రభావతి ఎంత సౌందర్యవతి! ఈమెకు ద్వారకలో ఉండే ప్రద్యుమ్నుడే భర్త కాదగును!" అని చెప్పుకున్నాయి. ఆ మాటలు ప్రభావతి విన్నది.

ఈ లోపుగా వజ్రనాభుడు తన కుమార్తెకు నాట్యంలో శిక్షణ ఇయ్యటానికి జగత్ప్రసిద్ధుడైన నాట్యాచార్యుణ్ణి, భద్రుడు అనేవాణ్ణి, పిలిపించాడు. అయితే వజ్రపురికి వెళుతున్న భద్రుణ్ణి దేవతలు తస్కరించారు.





దేవతలు భద్రుడు ధరించిన పాత దుస్తులూ, ఆభరణాలూ తీసివేసి, మంచి ఖరీదైన దివ్యాభరణాలిచ్చి, అతని దుస్తులనూ, ఆభరణాలనూ ప్రద్యుమ్నుడికి కట్టబెట్టి, ప్రభావతి వద్దకు పంపారు.



భద్రుడి వేషంలో ప్రద్యుమ్నుడు వజ్రపురి చేరి, ప్రభావతితో తాను ఎవరైనదీ చెప్పాడు. ప్రభావతి పరమానందం చెందింది.



ప్రభావతీ ప్రద్యుమ్నులు రహస్యంగా పెళ్ళాడారు. ఎప్పుడూ దండయాత్రల మీద తిరిగే వజ్రనాభుడికి ఈ సంగతి తెలియదు. కాలక్రమాన ప్రభావతి కొడుకును కన్నది.



ప్రభావతి కొడుకును కన్నతరవాత వజ్రనాభుడు నిజంతెలుసుకుని, ప్రద్యుమ్నుడితో యుద్ధానికి తలపడ్డాడు. కృష్ణుడు పంపిన చక్రాయుధంతో ప్రద్యుమ్నుడు వజ్రనాభుణ్ణి చంపేశాడు.



# ఆస్తీకుడు

పురాణ బాలలలో అనేక విధాల విచిత్రమైనవాడు ఆస్తీకుడు. ఇతని తండ్రి జరత్కారుడు అనే బ్రాహ్మణుడు. ఈ జరత్కారుడు జీవితమంతా బ్రహ్మచర్యంలో గడప నిశ్చయించి, తపస్సులో కాలం గడపసాగాడు.

ఒకనాడు జరత్కారుడు ఒక విచిత్రమైన తపస్సు చేసుకునేవారిని చూశాడు. వాళ్ళు ఒక చెట్టుకు అంటుకుని, తల కిందులుగా వేళ్ళాడుతున్నారు.

అతను వారితో, "అయ్యా, మీరెవరు? మీరు చేసే తపస్సు చాలా చిత్రంగా ఉన్నది. దాని విధానం ఏమిటో దయవుంచి నాక్కూడా తెలియ చెప్పండి," అన్నాడు.

దానికి వాళ్ళు, "మేం జరత్కారుడనే వాడి తాతముత్తాతలం. వాడికి సంతానం లేని కారణంగా మాకు అధోలోకాలు కలగబోతున్నాయి. అంతేగాని మేం ఎలాంటి తపస్సూ చెయ్యటం లేదు." అన్నారు.

ఈ మాటలు విని జరత్కారుడు బాధపడి, పెళ్ళాడటానికీ, పిల్లలను కనటానికీ నిశ్చయించుకుని, తన పేరే గల కన్య దొరికితే పెళ్ళాడదామనుకుని, అలాటి కన్యకోసం వెదకసాగాడు. తన పేరేగల భార్యను చేసుకుందామని అతను అనుకోవటంలో ఆంతర్యం, అలాటిది దొరకకపోతే పెళ్ళి మానేద్దామని కావచ్చు.

కాని అలాటి పేరు గల కన్య ఉన్నది. ఆమె పేరు జరత్కారువు. ఆమె నాగరాజైన వాసుకి చెల్లెలు. జరత్కారుడు తన పేరు గల కన్యకోసం వెతుకుతున్నట్టు తెలిసి, వాసుకి అతనికి తన చెల్లెలిని ఇచ్చి పెళ్లి చెయ్యటానికి ఒప్పుకున్నాడు. ఆ పెళ్లి ద్వారా నాగకులానికీ, ఆర్యులకూ

మధ్య వైరం తగ్గుతుందని వాసుకి ఆశ పడ్డాడు. అతని ఆశ నిరాశ కాలేదు.

జరత్కారుడు జరత్కారువును పెళ్లాడి ఒక కొడుకును కన్నాడు. వాడే ఆస్తీకుడు. కొడుకును కని పితృదేవతల ఋణం తీర్చుకున్నాననుకున్నది మొదలు జరత్కారుడికి మళ్లీ బ్రహ్మచర్యం మీదా, తపస్సు మీదా బుద్ధిపోయింది. ఏదో వంక పెట్టి తన భార్యనూ సంసారాన్నీ వదిలి పోవాలని చూస్తున్న జరత్కారుడికి మంచి అవకాశం దొరికింది. ఒక రోజు సాయం కాలం సూర్యుడు అస్తమించబోతూంటే, నిద్రపోతున్న జరత్కారుణ్ణి భార్య లేపింది. జరత్కారుడు తనను భార్య అవమానించిందని మండిపడి, అప్పటి కప్పుడే ఇల్లూ, సంసారమూ విడిచి వెళ్లిపోయాడు.

ఆస్తీకుడు చ్యవనుడి కొడుకైన ప్రమతి వద్ద వేదశాస్త్రం చదువుకుని, చిన్నతనం లోనే గొప్ప విద్వాంసుడు అనిపించుకున్నాడు.

ఆ సమయంలో, తక్షకుడు కరవగా పరీక్షిత్తు చనిపోవటమూ, అందుకు ప్రతీకారంగా పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు సర్పయాగం చేసి నాగులనందరినీ అగ్నికి ఆహుతి చెయ్యనారంభించటమూ జరిగింది.

ఆస్తీకుడి తల్లి అయిన జరత్కారువు తన కొడుకుతో, ''నువు జనమేజయుడు చేసే యాగానికి వెళ్లి, ఎలాగయినా ఆయనచేత నాగవంశ నిర్మూలనం మాన్పించు,'' అన్నది.

ఆస్తీకుడు సర్పయాగానికి వెళ్ళి, తన విద్యావిశేషంతో జనమేజయుణ్ణి మెప్పించాడు. జనమేజయుడు యాగ సమయంలో బ్రాహ్మణులకు కోరినవి ఇస్తున్నాడు. ఆస్తీకుడు అంత చిన్న వయసులో అంత జ్ఞాని కావటం చూసి ముచ్చటపడి, జనమేజయుడు అతన్ని ఏం కావాలో కోరుకోమన్నాడు.

ఆస్తీకుడు సర్పయాగం మానమని కోరాడు. అది ఆగిపోయింది.





# కయ్యంలో వియ్యం

సుమారు నాలుగు వందల సంవత్సరాల క్రిందట, మైసూరు ప్రాంతంలో ఒక రాష్ట్రాన్ని పురుషోత్తము డనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఆయన గంగ వంశానికి చెందినవాడు. గౌరవనీయుడైన ప్రభువు. అవివాహితుడు. తగిన కన్య దొరికితే తప్ప పెళ్లాడనని పట్టుదల వహించాడు.

ఆ కాలంలో, కాంచీపురాన్ని ఏలే కంచిరాజుకు ఒక కుమార్తె ఉండేది. ఆమె లోకైకసుందరి అని పేరు పొందింది. పురుషోత్తముడికి ఈ కన్య అన్నివిధాలా తగినదని లోకంలో ఒక వదంతి బయల్దేరింది.

ఈ వార్త పురుషోత్తముడి తండ్రికి చేరగానే, ఆయన కంచిరాజుకి పురోహితుని ద్వారా రాయబారం పంపించాడు. పెళ్లి చూపులకు ఏర్పాటు కూడా జరిగింది. కంచిరాజు వారికి సమస్తమైన మర్యాదలూ జరిపించి, తనకు కావలసిన భోగట్టాలన్నీ తెలుసుకున్నాడు.

పురుషోత్తముడు గొప్ప వంశానికి చెందిన యువకుడు, మంచి విద్యావంతుడు, శక్తి సామర్థ్యాలు కలవాడు. ఇన్నిటికీ మించి ఉన్నతమైన అంతస్థు కలిగిన వాడు. పైగా ఆ సమావేశంలో పురుషోత్తముడూ, కంచిరాజు కూతురూ ఒకరినొకరు చూచుకొని మనసులో ఇష్టపడ్డారు.

ఇన్ని విధాల అనుకూలంగా ఉండే పురుషోత్తముని సంబంధం కంచిరాజుకు బాగా నచ్చింది. అందుచేత, ఖాయపరిచి కబురు చేదామని అనుకొంటూ వున్నాడు. పురుషోత్తముడు కూడా ఈ సంబంధం నిశ్చయమైనట్టే భావించి, తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.



అయితే, తీరా పురుషోత్తముడు మరలి పోయిన తరువాత కంచిరాజుకు ఒక చిత్రమైన సంశయం పట్టుకొన్నది. అది యేమిటీ అంటే—

గంగవంశపు రాజులు గొప్ప భక్తులు. తరతరాలుగా వారు జగన్నాథస్వామిని కొలుస్తూ ఉండేవారు. పుణ్యక్షేత్రమైన శ్రీజగన్నాథంలో స్వామికి బ్రహ్మాండమైన ఆలయం నిర్మించింది కూడా వారే— అనగా గంగవంశ ప్రభువులే. స్వయంగా స్వామివారికి కైంకర్యాదులు జరిపించటం ఆ రాజులకు వంశాచారమై వుంటున్నది.

ఇలా వంశ పరంపరగా వస్తున్న ఆచారాన్ని అనుసరించి, ఏడాదికి ఒకసారి లాంఛనప్రాయంగా, పురుషోత్తముడు కూడా జగన్నాథస్వామి వారి ఆలయానికి వెళ్ళటం, ఉత్సవ సమయమందు స్వామికి సేవచేసినట్టు సూచనగా బంగారు కట్టుగల చీపురు కట్టతో అట్టె నేల ఊడవటం మామూలు.

ఈ సంగతి తెలిసిన కంచిరాజు మనసు మార్చుకొని, "ఊడ్చేవాడికా నా కూతురు నిచ్చి పెళ్లి చేయటం? ఇవ్వను గాక ఇవ్వను," అని ఖచ్చితంగా చెప్పి, పురుషోత్తముడి తండ్రికి కబురు పంపించాడు.

కంచిరాజు పంపిన కబురు చెవిని పడగానే, పురుషోత్తముడికి చెప్పలేని పౌరుషం వచ్చేసింది. అందులోనూ, ఈ విధంగా తమ ఇలవేలుపయిన స్వామి వారిని దూషించటంతో అతను ఉగ్రుడై, కంచి రాజుకి శాస్తి చేయాలని ప్రతిజ్ఞ పట్టాడు.

పురుషోత్తముడు ఇలా ప్రతిజ్ఞ పట్టిన కొద్ది రోజులలోనే గంగసేనలు పోయి కంచిరాజ్యాన్ని ముట్టడించినై. అయితే, కంచిరాజు చూడగా సామాన్యుడు కాదు. ఆ యుద్ధంలో గంగసేనలను అవలీలగా తరిమేశాడు కంచిరాజు.

ఓడిపోయిన పురుషోత్తముడు నిరాశ చెందలేదు. ఈసారి రెట్టింపు ఉత్సాహంతో మరింత ఎక్కువగా సైనికబలం సమకూర్చుకొని, ఇంకా ఎక్కువ పట్టుదలతో

రెండవసారి యుద్ధానికి వెళ్ళాడు. ఎంత సమర్థుడైనప్పటికీ కంచిరాజు, ఈమారు జరిగిన మహాయుద్ధంలో నెగ్గలేక పోయ్యాడు.

ఎప్పుడైతే కంచిరాజు ఓడిపోయాడో, కసికొద్దీ పురుషోత్తముడు, తనకు శత్రువైన కంచిరాజునూ, రాజకుమారినీ బంధించమని ఆజ్ఞాపించాడు.

ఇప్పుడు తన వశమైవున్న ఆ రాజకుమారిని పెళ్లాడటానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు గనుక, పురుషోత్తముడు అలా చేస్తాడని అనుకొన్నారు అందరూ. కాని, పురుషోత్తముడు ఆ పిల్లను పెళ్ళాడదలచలేదు సరికదా, మళ్ళీ కన్నెత్తి ఐనా చూడలేదు. తన మంత్రిని పిలిచి, "ఈ అమ్మాయికి ఎవడైనా ఊడ్చేవాడి సంబంధం చూచి ముడిపెట్టవలసిం,"దని ఆజ్ఞ ఇచ్చాడు.

కోపంకొద్దీ రాజు ఇచ్చిన ఆజ్ఞను పాలించటమా, వద్దా? అని గట్టి సమస్య పట్టుకొన్నది మంత్రికి. అయితే, మంత్రి మంచి బుద్ధికుశలుడు. ఈ విషయంలో ఎంతమాత్రం తొందర పడకూడదు, బాగా నిదానించాలి అనుకొన్నాడు. "సరే"నని రాజువద్ద సెలవు తీసుకొని, ఆ క్షణమందే ఎవ్వరికీ తెలియని ఒక రహస్యస్థలంలో కంచి రాజకుమారికి బస ఏర్పరిచి,



అక్కడ ఆమెకు సమస్తమైన రాజోపచారాలూ జరగటానికి తగిన ఏర్పాట్లు చేశాడు. ఈ సంగతి బ్రహ్మరుద్రులకైనా తెలియదన్నమాట.

ఆజ్ఞ ఇచ్చిన తరువాత పురుషోత్తముడు రాజకుమారిని గురించిన సమాచారమే మరచిపోయాడు. కంచిరాజుకు కూడా క్రమేణ కోపం తగ్గింది. దురుసుతనంగా తను ఆనాడు తూలనాడినందుకు ఎంతగానో పశ్చాత్తాపం చెందాడు.

తరువాత, మరి కొద్ది నెలలకల్లా మళ్లీ శ్రీ జగన్నాథస్వామివారి ఉత్సవాలు వచ్చినై. మామూలు ప్రకారం పురుషోత్తముడు స్వామిని సేవించే దీక్షలో మగ్న

డయ్యాడు. బంగారు పిడి గల ఒక చీపురుకట్ట ప్రభువు చేతికి అందించాడు పూజారి. పురుషోత్తముడు అత్యంత భక్తితో స్వామివారి పాదాలవద్ద ఊడుస్తున్నాడు.

ఆ సమయాన మంత్రి వచ్చి వినయంగా ప్రభువు ఎదుట చేతులు కట్టుకు నిలబడ్డాడు. అతని వెంబడే సర్వాలంకార శోభిత అయిన ఒక లోకైక సుందరి పూలమాల చేత పట్టుకొని నిలబడింది.

"మహారాజా! మన్నించాలి. ప్రభువుల ఆజ్ఞ, పాటించవలసిన సమయం నా కిప్పుడు దొరికింది. 'శ్రీ స్వామివారి పాదధూళిని ఊడ్చి సేవించేవానినే భర్తగా ఎంచుకొన్నాను' అని ప్రతిజ్ఞ పట్టి వున్నది ఈ రాకుమారి. ఎక్కడ వెదకినా అటువంటి యోగ్యుడు నాకు కనిపించలేదు. కనుక, ఈ కన్యను మళ్ళీ ఏలికకే అర్పించుకొంటున్నాను." అని చెప్పి వెనక్కు తప్పుకొన్నాడు బుద్ధికుశలుడైన మంత్రి.

అప్పుడు కంచి రాజకుమారి భక్తితో పూలమాలను పురుషోత్తముడి మెడలో వేసింది. అకస్మాత్తుగా గుడిపైనుండి పువ్వుల వాన కురిసింది. పురుషోత్తముడికి అమితాశ్చర్యం కలిగింది. తలవసి తలంపుగా వెనుకటి విషయాలు గప్పున గుర్తుకు వచ్చినై.

ఇదంతా స్వామివారి మహిమే కదా అనుకొని, పురుషోత్తముడు ఈ పెళ్లికి తన సమ్మతిని తెలిపాడు.

అప్పుడే కంచిరాజు కూడా విముక్తుడై అక్కడికి వచ్చాడు.

పురుషోత్తముడికీ, కంచిరాజు కుమార్తెకూ, ఒక శుభ ముహూర్తాన అత్యంత వైభవంగా వివాహం జరిగింది!

ఈ విధంగా జరిగినందుకు రాజ్యంలో ప్రజలంతా అమితంగా సంతోషించారు. మంత్రి యొక్క బుద్ధికుశలతను ఆబాలగోపాలమూ వేనోళ్ళ వినుతించారు. "ధన్యుణ్ణి అయ్యాను" అనుకొన్నాడు కంచిరాజు.



# నువ్వులు ఎలా తినాలి?

సుబ్బిశెట్టి నువ్వులను ఎండబోసి, రెండు చేతులూ లేనివాణ్ణి కాపలా ఉంచాడు, మొండి చేతులతో వాడు నువ్వులు తినలేడని! అయినా అరగంట ఆగి శెట్టి నువ్వులను చూడ్డానికి వచ్చాడు. అవిటివాడు నువ్వులు తిన్నాడేమోనని అనుమానం వచ్చి, "ఏం రా? నువ్వులు తగ్గినట్టున్నాయి. నువు తిన్నావు కదూ?" అని శెట్టి అడిగాడు.

"అవిటివాణ్ణి గదా, ఎలా తినగలను, బాబూ?" అని కాపలావాడు తన మొండి చేతులు చూపించాడు.

"ఆ మాత్రం నాకు తెలుసులేరా! మొండిచెయ్యి తడి చేసుకుని, దానికి నువ్వులు అద్దుకుని తినలేవా ఏం?" అన్నాడు శెట్టి.

తను అలాటి పని చెయ్యలేదని అవిటివాడు తన తల్లి మీదా, పెళ్ళాం మీదా, పిల్లల మీదా ప్రమాణాలు చేశాడు. శెట్టి తృప్తిపడి వెళ్ళిపోయాడు.

అవిటివాడికి నువ్వులు ఎలా తినాలో తెలిసిపోయింది. ఆ పద్ధతి అవలంబించి, వాడు నువ్వులు తిననారంభించాడు. —కొలపల్లి ఈశ్వరరావు






వివేకవర్ధన మహారాజు తన ప్రజలు ఎల్ల కాలమూ సంతోషంగా ఉండాలని కోరే వాడు. అందుకు ఏం చెయ్యాలని ఆయన జ్ఞానులను అడిగితే, సౌఖ్యాలు మనిషికి నిజమైన సంతోషం ఇయ్యవనీ, తృప్తి ఒకటే ఆ పని చెయ్యగలదనీ చెప్పారు.

తృప్తి ఎలా వస్తుందని రాజు వారిని అడిగాడు.

"ప్రజలకు వేదాంతం బాగా వంట బట్టాలి. వేదాంతసారాన్ని కాచి వడగట్టగా తయారైనది భగవద్గీత. ఆ గ్రంథాన్ని ప్రజలకు వంటబట్టేలా చేసినట్టయితే, వారికి తృప్తీ, సంతోషమూ కలుగు తాయి," అన్నారు జ్ఞానులు.

వివేకవర్ధనుడు పండితులను నియో గించి, తానే స్వయంగా గీతా బోధలు విని, జ్ఞానులు చెప్పిన మాటలలో నిజ మున్నదని అనుకున్నాడు. అయితే ప్రజ లందరికీ గీతాసారం నూరి పొయ్యడానికి అనేకమంది సమర్థులు కావాలి గదా! అందుకని ఆయన ఒక ప్రకటన చేశాడు. భగవద్గీతను పామరులకు అర్థమయేటంత సులభరీతిని బోధించగల పండితోత్తము లకు రాజుగారు సన్మానం చేస్తారని చాటింపు వేయబడింది.

చాటింపు విని అనేకమంది పండితులు ఆస్థానానికి వచ్చారు. వారిని పరీక్షించ మని రాజు ఆస్థానపండితుణ్ణి నియో గించాడు. ఆస్థానపండితుడు వచ్చిన వారితో గోష్ఠి జరిపి, రాజు వద్దకు తిరిగి వెళ్ళి, "మహాప్రభూ! వారందరూ ఉద్దండ పండితులు. భగవద్గీతలో వారిని పరీక్షించే శక్తి నాకు లేదు," అన్నాడు.

రాజుకు ఏం చెయ్యాలో పాలుపోలేదు.

ఆ సమయంలో రాజధానికి చిరంజీవి వచ్చాడు. దేశంలోగల ఉద్దండ పండితు

లందరూ రాజుగారి దివాణానికి వచ్చి ఉన్నారని తెలిసి, వారితో గోష్ఠి జరిపే కోరికతో చిరంజీవి ముందుగా ఆస్థాన పండితుణ్ణి కలుసుకున్నాడు.

ఆస్థాన పండితుడు అదివరకే చిరంజీవిని గురించి విని ఉండడం చేత, అతన్ని రాజు వద్దకు తీసుకు వెళ్ళి, ''ఎలాటి చిక్కు ప్రశ్న అయినా విడదీయగల సమర్థుడు ఈయన! అదృష్ట వశాత్తు మన నగరానికి వచ్చారు. మన సమస్యను ఈయన పరిష్కరించగలరనుకుంటాను,'' అన్నాడు.



రాజు చిరంజీవికి తన సమస్య చెప్పాడు.

''నేను అంత గొప్పవాణ్ణి కాను, కాని ప్రయత్నిస్తాను,'' అన్నాడు చిరంజీవి.

మర్నాడు రాజసభలో పండితులందరూ సమావేశమైనప్పుడు, చిరంజీవి వారిని కలయజూసి, ''మీ పాండిత్యంలో తారతమ్యాలు తెలుసుకోవాలని ప్రభువులు అనుకుంటున్నారు. అందుకుగాను ఒక పోటీ ఏర్పాటు చెయ్యడం మీకు సమ్మతమేనా?'' అని అడిగాడు.

సమ్మతమేనని అందరూ తలలు ఆడించారు.

చిరంజీవి ఒక్కొక్క పండితుణ్ణీ చేరి, ''భగవద్గీతకు భాష్యం చెప్పడానికి ఒక జీవితకాలం చాలదంటారు. అలాంటిది మీరు ఆ మహాగ్రంథాన్ని ఇంత స్వల్ప కాలంలో ఎలా అర్థం చేసుకోగలిగారు?' అని అడిగాడు.

''మీరు చెప్పినది నిజమే. కాని నేను పట్టుదలగా కృషిచేసి, గీతాసారాన్ని వంట పట్టించుకున్నాను,'' అంటూ ప్రతి పండితుడూ తన కృషి గురించీ, ఘనత గురించీ చెప్పుకున్నాడు.

అందరితోటీ మాట్లాడినాక చిరంజీవి రాజు వద్దకు తిరిగి వచ్చి, ''మహాప్రభూ, వీరందరూ మహా పండితులే! అయితే వీరిలో ఏ ఒక్కరూ గీతాసారాన్ని వంట బట్టించుకోలేదు,'' అన్నాడు.

పండితులు తెల్లబోయారు. రాజు కూడా, "మీరు వాళ్ళను గీత గురించి ప్రశ్నించకుండా ఇలా అనడం సమంజసంగా లేదు," అన్నాడు.

"నేను కూడా గీత చదివాను. గీతలో నాకు అర్థమయినది ఒకటే: ప్రతిమనిషీ 'నేను' అన్న భావాన్ని విడనాడాలి. ఏ పనిగాని తాను చేస్తున్నానని గాక, భగవంతుడే చేయిస్తున్నాడనీ, తాను నిమిత్త మాత్రుడిననీ గుర్తించాలి. 'నేను' అన్న పదం అజ్ఞానాన్నీ, అహంకారాన్నీ తెలియజేస్తుంది. గీతాసారాన్ని వంట బట్టించుకున్నామంటున్న ఈ పండితులందరూ దాన్ని తమ స్వశక్తితో సాధించామనుకుంటున్నారు," అన్నాడు చిరంజీవి.

పండితులందరూ ఏకగ్రీవంగా చిరంజీవి చెప్పినది నిజమనీ, తమలో విద్యాగర్వమూ, అహంకారమూ జాస్తిగా ఉన్నాయని తెలుసుకున్నామనీ, ఆయన మాటలతో తమకు జ్ఞానోదయ మయిందనీ ఒప్పుకున్నారు.

రాజు పండితులను యథాశక్తి సన్మానించి పంపేసి, చిరంజీవితో, "నా ప్రజలు సంతోషంగా ఉండగలందులకు వారికి గీత బోధింపజేతామనుకున్నాను. ఇంకేదైనా ఉపాయం ఉంటే చెప్పండి," అన్నాడు.

చిరంజీవి రాజుకు ఇలా చెప్పాడు:

"సంతోషం అనే పదానికి అర్థం లేదు, ప్రభూ. దేశంలో సోమరులనేవాళ్ళు లేకుండా చెయ్యండి. వయోజనులందరూ కష్టపడి పనిచేసే మాటైతే, దేశం కలకాలం సిరిసంపదలతో తులతూగుతుంది. తాను కష్టపడి సంపాదించుకున్నది అనుభవించే ప్రతివాడికీ తనకు తెలియకుండానే తృప్తి ఉంటుంది. వేదాంత బోధలు మనుషుల్ని సోమరులుగా చేస్తాయి. ఆసక్తి ఉన్నవారు వాటిని గురించి ఎలాగూ తెలుసుకుంటారు. అది వారి స్వవిషయం అవుతుంది. దానికోసం మీరు ప్రత్యేకంగా ప్రయత్నించవలసిన అవసరం లేదు."



# దొంగ దొంగే

ఒక రాత్రి ఒక దొంగ ధర్మయ్య ఇంట్లోకి పరిగెత్తుకుంటూ వచ్చి, తలుపు గడియపెట్టి, ధర్మయ్య కాళ్ళపై పడి, "అయ్యా, నన్ను రక్షకభటులు తరుముతూ వస్తున్నారు. వాళ్ళకు దొరికానంటే నాకు చావు తప్పదు. నేనిటు రాలేదని చెప్పి, నా ప్రాణం కాపాడారంటే మీ మేలు మరవను," అని ప్రాధేయపడ్డాడు.

ధర్మయ్య రాజభటులతో, అటుగా ఎవరూ రాలేదని చెప్పి, దొంగను కాపాడాడు. రాజభటులు వెళ్ళిపోగానే దొంగ ధర్మయ్యకు కత్తి చూపించి, ఇంట్లో ఉన్న నగలూ, డబ్బూ తన కిచ్చెయ్యమన్నాడు.

"నా మేలు మరవను అని ఇప్పుడేకదా అన్నావు?" అన్నాడు ధర్మయ్య ఆశ్చర్యంతో.

"నేను అలా అనలేదు," అన్నాడు దొంగ.

"దొంగవైతే మాత్రం ఇంతలోనే ఇంత అబద్ధం ఆడతావా?" అని ధర్మయ్య అడిగాడు.

"నువు పెద్ద హరిశ్చంద్రుడివిలేవయ్యా! నువు ఇందాక రాజభటులతో అబద్ధం చెప్ప లేదూ?" అన్నాడు దొంగ.

—కోలార్ కృష్ణఅయ్యర్





# దొరికిన నిధి

ఒక గ్రామంలో గంగులు అనే రైతు ఉండేవాడు. అతను తన రెక్కల కష్టంమీద ఉన్నంతలో సుఖంగా బతకటమేగాక, తల్లిలేని తన ఇద్దరు కొడుకులనూ లోటు కనబడనీయకుండా పెంచాడు. వాళ్లు పెరిగి పెద్దవాళ్ళయి కూడా తండ్రికి సంపాదనలో తోడుపడక పోగా, చీటికి మాటికి తండ్రిని తమ విలాసాలకు డబ్బు అడిగేవారు.

వాళ్ళకు బుద్ధిచెప్పాలని గంగులు వాళ్ళతో, "ఒరే, మీ ఖర్చుకు తగినంతగా నేను సంపాదించలేను. ఒకచోట మీ తాత దాచిన నిధి ఉన్నది. అది తెచ్చుకోండి. నేను నాకు కావలసినంత ఎప్పుడూ సంపాదించుతూ రావడంవల్ల నేనా నిధి కోసం పోలేదు," అన్నాడు.

"ఆ నిధి ఎక్కడ ఉన్నది?" అని కొడుకులు ఆత్రంగా అడిగారు.

"ఉత్తరంగా రెండువందల మైళ్ళు పోతే ధర్మపురి అనే ఊరు వస్తుంది. ఆ ఊరికి దక్షిణంగా రత్నగిరి అనే కొండ ఉన్నది. ఆ కొండ పడమర పార్శ్వంలో ఒక గుహ ఉన్నది. గుహలోకి పోతే, మీ తాతపేరు చెక్కిన రాయి కనిపిస్తుంది. ఆ రాతిని తొలగిస్తే నిధి దొరుకుతుంది. దాన్ని తెచ్చుకొని సుఖంగా బతకండి. అది కావాలనుకుంటే కనీసం రెండేళ్ళు పాటు శ్రమపడాలి మరి," అన్నాడు గంగులు.

వెంటనే గంగులు కొడుకులు చేతికి అందినంత డబ్బూ, దారిలోకి తిండీ తీసుకుని ఉత్తరంగా బయలుదేరారు. వాళ్లు రెండు ఊళ్ళు దాటేసరికల్లా, ఇంటి నుంచి తెచ్చుకున్న తిండీ, డబ్బూకూడా అయిపోయాయి. వాళ్ళకు ఏం చేయ్యాలో తోచక ఆలోచిస్తూంటే,

రాంబాబు

ఒక రైతు తటస్థపడి, "కూలిపనికోసం చూస్తున్నారా? నా పొలంలో నాట్లు వేయిస్తున్నాను. వచ్చి పనిచేసి డబ్బులు తీసుకోండి," అన్నాడు.

వాళ్ళ తక్షణ సమస్య పరిష్కారం కావటానికి ఆ రైతు దేవుడల్లే వచ్చినట్టు గంగులు కొడుకులకు అనిపించింది. వాళ్లు నాలుగురోజులపాటు ఉత్సాహంగా పనిచేసి, డబ్బులు సంపాదించుకున్నారు. మిగిలిన ప్రయాణం ఎలా కొనసాగించాలో వాళ్ళకు అర్థమైపోయింది.

వాళ్ళు ఆ డబ్బు అయిపోయినదాకా ప్రయాణంచేసి, మళ్ళీ పనికోసం వెతక సాగారు. ఒక గుర్రాల వర్తకుడు వాళ్లను తన గుర్రాల పోషణకు పెట్టుకుని, ఆ గుర్రాలు అమ్ముడుపోయినదాకా పనిలో ఉంచుకుని, వాళ్ళ పనితనాన్ని మెచ్చుకుని, ఇవ్వవలసినదానికన్న ఎక్కువే ఇచ్చి పంపాడు.

ఉదయగిరి అనే ఊరు చేరుకునే సరికి వాళ్ళ డబ్బు మళ్ళీ అయిపోయింది. ఆ ఊళ్ళో ఒక వర్తకుడు వాళ్ళను పనికి పెట్టుకున్నాడు. ఇద్దరికీ వర్తక సరళి తెలియటమేగాక, తమ సంపాదన పెట్టుబడి పెట్టుకుని వర్తకం చేసి బాగా డబ్బు సంపాదించవచ్చునని తోచింది. వర్తకుడు తమకు ఇచ్చే డబ్బు తమ అవసరాలకు చాలా పొదుపుగా ఖర్చుచేసి, మిగిల్చిన డబ్బుతో వాళ్లు ఒక దుకాణం తెరిచారు.



వ్యాపారం బాగా కలిసివచ్చింది. కాలక్రమాన వాళ్లు భాగ్యవంతులై, పెళ్ళిళ్లు చేసుకున్నారు. తరవాత వాళ్ళు నిధి కోసం బయలుదేర నిశ్చయించి, ఇంటి బాధ్యతలను తమ భార్యలకు అప్పగించి, మంచి మొత్తంలో డబ్బు తీసుకుని ప్రయాణమయారు.

తీరా వాళ్ళు ధర్మపురి అనే ఊరు చేరుకునేసరికి, అక్కడ ఏ కొండాలేదు. రత్నగిరి అనే కొండ ఆ ప్రాంతంలో ఎక్కడా లేదని అనేకమంది చెప్పిన మీదట, తమ తండ్రి తమను మోసగించాడని, వాళ్ళకు చాలా కోపం వచ్చింది.

వాళ్ళు తిరిగి తమ తండ్రి వద్దకు చేరుకుని, "ఛీ! మమ్మల్ని వదిలించుకోవటంకోసం నిధి ఉన్నదని మాతో అబద్ధం చెప్పావా?" అని తండ్రిని నిందించారు.

గంగులు చిన్నగా నవ్వి, "నేను అబద్ధం ఆడలేదే! మీ వాలకం చూస్తే నిధి దొరికినవాళ్ళలాగే కనిపిస్తున్నారు." అన్నాడు.

"ఇది మేం కష్టపడి సంపాదించుకున్నాం." అంటూ కొడుకులు గంగులుకు తమ అనుభవమంతా చెప్పారు.

"ఇంకేం? నిధి మీలోనే ఉన్నది! మీకు కావలసిన డబ్బుకు ఇతరులమీద ఆధారపడకుండా స్వయంకృషి అలవరుచుకున్నారు. ఆ తరువాత పని ఎంత శ్రద్ధగాచేస్తే అంత హెచ్చు సంపాదించవచ్చునని తెలుసుకున్నారు. ఆ తరవాత అల్పసంతోషులల్లే ఉండిపోకుండా కోటికి పడగెత్తాలన్నంత దీక్ష అవలంబించారు. ఎవరు నిధి సంపాదించినా ఈ గుణాలు లేకుండా సంపాదించలేరురా!" అన్నాడు గంగులు.

తమ తండ్రి తమకు తరిగిపోయే నిధి కాక, తరగని నిధి చూపించాడని గంగులు కొడుకులు గ్రహించి, తండ్రికి తమ కృతజ్ఞత తెలుపుకున్నారు.






కోసలదేశపు రాజధాని అయిన అయోధ్యా నగరాన్ని ధ్రువసంధి అనే రాజు పాలించే వాడు. ఆయనకు మనోరమా, లీలావతీ అని ఇద్దరు భార్యలు. మనోరమకు సుదర్శనుడనీ, లీలావతికి శత్రుజిత్తు అనీ కొడుకులు కలిగారు. ఆ ఇద్దరిలోనూ సుదర్శనుడు ఒక మాసం పెద్దవాడు. శత్రుజిత్తు చాలా అందమైనవాడూ, మంచి తెలివిగలవాడూనూ; అతనంటే తండ్రికీ, మంత్రులకూ, సేవకులకూ, పౌరులకూ కూడా చాలా ఇష్టం.

ఇలా ఉండగా ధ్రువసంధి ఒకనాడు వేటకు వెళ్ళి, వేటాడుతూండగా అకస్మాత్తుగా ఒక పొదనుంచి సింహం ఒకటి అతని మీద పడింది. ధ్రువసంధీ, సింహమూ హోరాహోరి పోరాడి, చివరకు ఇద్దరూ చచ్చిపోయారు. రాజు వెంట వెళ్ళిన భటులు రాజభవనానికి తిరిగి వచ్చి, జరిగిన సంగతి మంత్రులకు చెప్పారు. మంత్రులు చచ్చిపోయిన రాజుకు ఉత్తరక్రియలు జరిపి, సుదర్శనుడికి రాజ్యాభిషేకం చెయ్యటానికి ప్రయత్నాలు ప్రారంభించారు. అది అందరికీ సమ్మతమే అయింది.

అయితే, కళింగదేశపు రాజు వీరసేనుడు, అంటే మనోరమ తండ్రి, తన అల్లుడు చనిపోయినవార్త విని, తన మనమడైన సుదర్శనుడి క్షేమసౌభాగ్యాలు చూడటానికి వచ్చాడు. అలాగే ఉజ్జయిని నుంచి శత్రుజిత్తు మాతామహుడైన యుధా



జిత్తు కూడా వచ్చాడు. ఇలా వచ్చిన మనోరమ తండ్రీ, లీలావతి తండ్రీ ఎవరి మనవడి మేలుకోరి వారు మంత్రులతో మాట్లాడారు.

ఆ సందర్భంలో యుధాజిత్తు వీరసేనుడితో, "నీ మనవడు సుదర్శనుడు వయసులో ఒక్క పిసరు పెద్ద అయితే అవుగాక. నా మనవడు శత్రుజిత్తు అన్ని ఇతర లక్షణాలలోనూ సుదర్శనుణ్ణి మించినవాడే. వయోజ్యేష్ఠుడికన్న గుణజ్యేష్ఠుడు ఎక్కువగదా! నా మనవడే రాజు కావటానికి అర్హుడు," అన్నాడు.

దీనికి వీరసేనుడు, "అది పిచ్చి మాట! నా కూతురు మనోరమ పట్టపు రాణి. ఆమెకు పుట్టిన సుదర్శనుడే రాజు. పెద్దవాడు రాజు కాదనే ధర్మం అదేం ధర్మం?" అన్నాడు.

అప్పుడు యుధాజిత్తు మంత్రులతో, "మీరూ, మీరూ ఏకమై సుదర్శనుణ్ణి రాజు చేస్తే, నా మనవడు శత్రుజిత్తు చేతులు కట్టుకుని కూర్చుంటాడనుకుంటున్నారా? వాడికి తెలివి ఉన్నది, బలం ఉన్నది, బలం గలవాణ్ణి నేనున్నాను. మిమ్మల్నందరినీ తుడిచిపెట్టి వాడు రాజ్యం పుచ్చుకుంటాడు! నేను కత్తిపట్టానంటే భూమినే చీల్చి పారెయ్యగలను. నాకు ఇతరులు ఒక లెక్కా? ఆలోచించుకోండి," అన్నాడు.

ఇద్దరు తాతలూ ఘర్షణపడసాగారు. వినే వారికి రోత పుట్టింది. ధ్రువసంధి చచ్చాడని తెలిసి, రాజ్యాన్ని దోచుకుందామని శృంగబేరపురం నుంచి అటవికులు వచ్చారు. వాళ్ళు ఒక వంక దూరంగా నగరాన్ని చుట్టుముట్టి ఉండగా, యుధాజిత్తూ, వీరసేనుడూ తమ తమ సైన్యాలను పోగుచేసుకుని, యుద్ధానికి తలపడ్డారు. రెండుపక్షాలూ దారుణంగా పోరాడాయి. ఆ పోరాటంలో యుధాజిత్తు వీరసేనుణ్ణి చంపేశాడు.

మనోరమ తన తండ్రి చావుకు ఎంతో దుఃఖించింది. భర్త పోయిన శోకానికి

తండ్రి పోయిన శోకం తోడయింది. కొడుకేమో చాలా చిన్నవాడు. ఏమీ ఎరగని అర్భకుడు. తనకు దిక్కెవరు? తన తండ్రిని చంపిన యుధాజిత్తు తన కొడుకు సుదర్శనుణ్ణి చంపకుండా విడిచి పెడతాడా? తన మనవణ్ణి రాజును చెయ్యటమేగద అతని ఆశయం? లీలావతితో తనకు సవతిపోరే తప్ప సఖ్యత ఉండబోదు. ఆమె తనను కారాగృహంలో పెట్టించకుండా ఊరుకోదు. మంత్రులు మొదట తన కొడుక్కు రాజ్యాభిషేకం చేతామనుకున్నవారే, కాని ఇప్పుడు వారు యుధాజిత్తు మాట వినక తప్పదు. ఎటు చూసినా తనకు అండ అన్నది లేదు.




ఇలా అనుకుని, మనోరమ విదల్లుడు అనే మంత్రిని రహస్యంగా పిలిపించి, తన పరిస్థితిని బట్టి తనకు కర్తవ్యం ఏమిటో చెప్పమన్నది.

విదల్లుడు ఆమెతో, "అమ్మా, నీకూ, నీ కుమారుడికీ ఇక్కడ ఏ మాత్రమూ క్షేమంలేదు. కాశీరాజు సుబాహువు నాకు మేనమామ. ఆయన మహా శక్తిమంతుడు. మనం అక్కడికి వెళితే కాపాడగలడు," అన్నాడు.

మనోరమ సరేనని, తన తండ్రికి తర్పణాలు విడిచి, సైరంధ్రి అనేదాన్నీ, తన కొడుకునూ తీసుకుని విదల్లుడి వెంట కాశీనగరానికి బయలుదేరింది. అయితే ఆ రాత్రి ఆమెనూ, ఆమె వెంట ఉన్న వారినీ దొంగలు దోచి, కట్టుబట్టలతో వదిలారు. మర్నాడు ఆమె పడవ మీద గంగానది దాటి, భరద్వాజుడి ఆశ్రమం ప్రవేశించింది.

భరద్వాజుడు ఆమెను చూసి, "ఎవరు నువు? ఎక్కడినుంచి వస్తున్నావు? నీ భర్త ఎవరు? పుట్టెడు శోకంలో ఉన్నట్టు కనిపిస్తున్నావు, ఏమిటి కారణం?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు ఆమె మరింతగా ఏడుస్తూంటే, విదల్లుడు మునితో, ధ్రువసంధి చావు మొదలుగా జరిగినదంతా చెప్పాడు. అంతావిని భరద్వాజుడు మనోరమతో,



చంపించటానికి నిశ్చయించుకుని, చిత్రకూట పర్వతానికి వెళ్ళి, నిషాదుల రాజైన బలుడు అనేవాణ్ణి వెంటబెట్టుకుని, శృంగిబేరపురాన్ని ఏలే దుర్దర్శుడు అనే వాడి వద్దకు వెళ్ళాడు.

ఈ సంగతి విని మనోరమ దుఃఖిస్తూ భరద్వాజుడి వద్దకు వెళ్ళి, తమకు రానున్న ఆపద గురించి చెప్పింది. భరద్వాజుడు, తన ఆశ్రమం వెలపల వచ్చి ఉన్న యుధాజిత్తును కలుసుకుని, "ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"మనోరమ కోసం," అని యుధాజిత్తు చెప్పాడు.

"భర్తపోయి, తండ్రిపోయి, పుట్టెడు దుఃఖంతో తన కొడుకును వెంటబెట్టుకుని ఈ ఆశ్రమంలో తలదాచుకున్న మనోరమ తిరిగి ఇక్కడినుంచి వెళుతుందా?" అన్నాడు భరద్వాజుడు.

"మర్యాదగా ఆమెను పంపితే పంపించు. లేకపోతే బలాత్కారంగా తీసుకుపోవలసి వస్తుంది," అన్నాడు యుధాజిత్తు.

భరద్వాజుడు ఆగ్రహావేశంతో, "ఓరీ పాపీ! హీనుడా! బలాత్కారంగా తీసుకుపోతావా? ఏదీ? తీసుకుపో! మా ఋషులంటే మీ రాజులకు అంత తేలిక అయిందా?" అన్నాడు.

"నీకు వచ్చిన భయమేమీ లేదు. నీ ఈ చిన్న కొడుకు రాజవుతాడు. నువు ఈ ఆశ్రమంలో ఉండిపో." అన్నాడు. ఆయన చూపిన పర్ణశాలలో మనోరమా, విదల్లుడూ, సైరంధ్రీ, సుదర్శనుడూ జీవించసాగారు.

అయోధ్యలో శత్రుజిత్తు మహా వైభవంగా రాజ్యాభిషేకం చేయించుకున్నాడు. మనోరమా, సుదర్శనుడూ ఎటు వెళ్లారో, ఏమయారో ప్రజలకు అంతుచిక్కలేదు. అయితే శత్రుజిత్తు తాత అయిన యుధాజిత్తుకు సుదర్శనుడూ, అతని తల్లీ భరద్వాజాశ్రమంలో ఉన్న సంగతి తెలియవచ్చింది. శత్రుశేషం ఉండటం మంచిదికాదని ఆయన సుదర్శనుణ్ణి



అప్పుడు యుధాజిత్తు తన మంత్రితో ఏకాంతంగా, "ముని మాటలు విన్నావు గదా! మనోరమనూ, ఆమె కొడుకునూ తీసుకుపోయే మార్గమేది? శత్రుశేషం ఉంచరాదు గద! సుదర్శనుణ్ణి చంపితే గాని నా మనవడి ఏలుబడికి క్షేమంలేదు. ఇక్కడ నన్ను ఎదిరించటానికి ఎవరున్నారు? ముని మాటలు చూసి మనం భయపడాలంటావా?" అన్నాడు.

దానికి మంత్రి, "మునుల మీదికి ఒంటి కాలితో పోవటం అంత మంచిది కాదు. వాళ్ళు శక్తిమంతులు. పూర్వం వసిష్ఠుడి మీదికి ఇలాగే వెళ్లి విశ్వామిత్రుడు గొప్ప పరాభవం పొందాడు. ఆ దెబ్బతో విశ్వామిత్రుడు రాజరికాన్ని వదిలేసి, తపశ్శక్తి సంపాదించటానికి ఋషి అయాడు. కాకపోయినా, సుదర్శనుడు దీనస్థితిలో ఉన్నాడు. డబ్బు లేదు. కుర్రవాడు. నీ మీదికి ఎలా వస్తాడు? అంతగా వస్తే అప్పుడే చూసుకోవచ్చు. అంతేగాని, ఈ మునితో తగాదా పెట్టుకుని ప్రాణం మీదికి మాత్రం తెచ్చుకోవద్దు" అంటూ హితవు చెప్పాడు.

మంత్రి మాటలు పాటించి యుధాజిత్తు భరద్వాజుడి దర్శనం చేసుకుని, జరిగిన దానికి క్షమాపణ చెప్పుకుని, తన ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత మనోరమ ఆశ్రమంలో నిశ్చింతగా ఉండిపోయింది. సుదర్శనుడు క్రమంగా పెరిగి, పదకొండేళ్ళవాడై, ముని వద్ద వేదం అభ్యసించాడు. అలాగే శాస్త్రాలూ, ధనుర్వేదమూ నేర్చుకున్నాడు.

ఒక రోజు సుదర్శనుడికి మహాదేవి కలలో కనిపించి, అతనికి అస్త్రవిద్యలు ప్రసాదించింది.

ఇంతలో, కాశీరాజు కూతురు శశికళ, అద్భుత సౌందర్యవతి అని విని సుదర్శనుడు ఆమెను పెళ్లాడగోరాడు. అదే విధంగా శశికళ కూడా భరద్వాజాశ్రమంలో ఉంటున్న సుదర్శనుణ్ణి గురించి విని, అతన్నే పెళ్ళాడ నిశ్చయించింది.

భరద్వాజాశ్రమంలో సుదర్శనుడు పగలు శశికళను గురించే ఆలోచిస్తూ, రాత్రి ఆమెనే కలలు కంటూ కాలం వెళ్ళబుచ్చుతూండగా, ఒకనాడు అతని వద్దకు శృంగిబేరపుర రాజైన నిషాదుడు వచ్చి, నాలుగు గుర్రాలు గల రథాన్ని, జెండాతోనూ, సమస్త ఆయుధాలతోనూ కూడినదాన్ని బహుమానంగా ఇచ్చాడు.

ఇదే సమయంలో భరద్వాజాశ్రమంలోని మునులు సుదర్శనుడితో, "నువు త్వరలోనే రాజు కాబోతున్నావు! నీకు మహాదేవి కటాక్షం ఉన్నది." అని మనోరమతో, "అమ్మా, వీరమాతా! నీ కొడుకు రాజు కాబోతాడు." అన్నారు.

"మీ నోటి చలవవల్ల అలాగే కావాలి! ఒక్కడు కూడా తోడులేని నా కొడుకు రాజెలా అవుతాడో మరి? అయినా మీ నోటి మాట అబద్ధం అవుతుందా? మీ దీవనే వాడికి అన్నిటినీ మించిన సహాయం!" అంటూ మనోరమ తన మనసులో సంతోషంతో పొంగిపోయింది.

సుదర్శనుడు తన రథం మీద ఎక్కి ఎక్కడ తిరిగినా అతని చుట్టూ ఒక అక్షౌహిణి సేన ఉన్నట్టుగా ఉండేది. సుదర్శనుడి మీద మనస్సు నిలిపిన శశికళ మాత్రం తిండి కూడా మాని కృశించసాగింది. ఆమె బాధ కొంతవరకు



గ్రహించిన తండ్రి సుబాహుడు ఆమెకు స్వయంవరం నిశ్చయించి, రాజులందరికీ వర్తమానం పంపాడు.

స్వయంవరాలు మూడు రకాలు: పణస్వయంవరమూ, శుల్కస్వయంవరమూ, ఇచ్ఛా స్వయంవరమూనూ. రాముడు శివధనుర్భంగం చేసి సీతను భార్యగా పొందినది పణస్వయంవరం. సుబాహుడు తన కూతురికి నిశ్చయించినది ఇచ్ఛా స్వయంవరం. స్వయంవరం వార్త వింటూనే నానా దేశాల రాజకుమారులు కాశీకి వచ్చి చేరారు.

ఎవరెవరు స్వయంవరానికి వచ్చినదీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్న శశికళ

కంట నీరు కార్చుతూ తన చెలికత్తెతో, "ఏళ్ళంతా దేనికి? నేను సుదర్శనుణ్ణి తప్ప మరొకరిని ఎలా వరిస్తాను? ధనమూ, రాజ్యాలూ దేనికి తగలెయ్యనా? పెళ్ళాడితే ప్రజ్ఞా, ప్రాభవాలు గలవాణ్ణి పెళ్లాడాలి! అలాంటివాడు సుదర్శనుడు ఒక్కడే!" అన్నది.

ఆమె చెలికత్తె ఈ మాట తీసుకుపోయి రాణికి చెప్పింది: "అమ్మా, మన శశికళ తన మనస్సును సుదర్శనుడనే అతనికి ధారాదత్తం చేసింది. అతను భరద్వాజాశ్రమంలో ఉంటాడట."

రాణి ఈ సంగతి తన భర్తకు చెప్పింది. అది విని రాజు ఆమెతో, "వాడి సంగతి తెలుసును! వాడు రాజ్యభ్రష్టుడై, తిండికి కూడా లేక, అరణ్యంలో తల్లితోబాటు మునిపల్లెలో ఉంటున్నాడు. వాడికి పిల్లనెలా ఇచ్చేది? అదృష్టవంతులూ, భాగ్యవంతులూ వేలకు వేలమంది ఉన్నారు. పిల్ల మనసు మార్చుకోమని నచ్చజెప్పు," అన్నాడు.

రాణి సరేనని శశికళ వద్దకు వెళ్ళి, చేరదీసి ముద్దు చేస్తూ, "తల్లీ, నువు కోరినవాడు అడవిలో కందమూలాలు తింటూ, నీరసించి, బంధువులకు వెలి అయి, అంగబలమూ, అర్థబలమూ లేని నిర్భాగ్యుడు. ఎందరో రాజకుమారులు గొప్ప గొప్పవాళ్ళు నీకోసం వచ్చి ఉన్నారు. ఆ సుదర్శనుడి తమ్ముడే ఉన్నాడు, ఎంతో గొప్ప అందగాడు; బలవంతుడు; రాజ్యం ఏలుతున్నాడు. అతని పేరు శత్రుజిత్తు. నీకు ఎంతో ఈడూ, జోడూగా ఉంటాడు. ఇతని కోసమే గదా ఇతని తాత కళింగరాజును చంపాడు? అది అలా ఉండనీ. ఇంతకన్న ఘోరం ఏమిటంటే, అవకాశం దొరికితే యుధాజిత్తు ఈ సుదర్శనుణ్ణి తప్పక చంపుతాడు. ఆ భయంతోనే గదా ఇతను భరద్వాజాశ్రమంలో తల దాచుకున్నాడు? నీ తండ్రి నిన్ను ఏ పరిస్థితిలోనూ సుదర్శనుడికిచ్చి పెళ్ళి చెయ్యడు. అందుచేత ఆ ఆలోచన మానుకో," అన్నది.





# కన్యాలాభం

వెంకయ్య తన కొడుకు నాగరాజుకు పెళ్ళి చేయాలనుకున్నాడు. అయితే, లోగడ నాగరాజు అల్లరిచిల్లరగా తిరిగి, చిన్న చిన్న దొంగతనాలు కూడా చేసి ఉండటంచేత వాడికి ఎరిగిన వాళ్ళెవరూ పిల్ల నియ్యటానికి ఒప్పుకోలేదు. చివరకు వెంకయ్య విసిగిపోయి, "నీకు పిల్లను తేవటం నా తరం కాదు. పైన, నా పరువు కూడా పోతున్నది. నువు ఎక్కడికైనా వెళ్ళి, పరువైనవాడిననిపించుకుని, పెళ్ళాన్ని తెచ్చుకున్నదాకా ఈ ఇంట్లో అడుగు పెట్టకు," అని నాగరాజును ఇంటి నుంచి తరిమేశాడు.

నాగరాజు తన ఇల్లూ, ఊరూ వదిలేసి, మరో ఊరు చేరుకున్నాడు. తన అవసరం గడవగలందులకు దొంగతనం చేద్దామని ఒక ఇంట ప్రవేశించాడు. ఆ ఇల్లు పున్నమ్మ అనే విధవరాలిది. ఆమె ఏక సంతానం గౌరికి పెళ్ళీడు వచ్చింది. తన కూతుర్ని తగినవాడికి ఎవడికైనా ఇచ్చి పెళ్లి చెయ్యాలని, పున్నమ్మ పాలూ, పెరుగూ, కోడిగుడ్లూ, పిడకలూ అమ్మి, అప్పుడప్పుడూ ఒక నగ చొప్పున చేయిస్తూ, వాటిని అన్నిటినీ ఒక పెట్టెలో దాస్తున్నది. ఆ నగలు నాగరాజు కంట పడినాయి. వాడు వాటిని కాజేసి, ఊరి బయట గుట్ట మీద ఉన్న గుడి ముందర గోయి తీసి, అందులో దాచిపెట్టి, తనను ఎవరూ పోల్చుకోకుండా సన్యాసి వేషం వేసుకున్నాడు.

మర్నాడు గౌరి పువ్వులు అమ్ముకు రావటానికి సంతకు వెళ్లింది.

ఆ ఊళ్ళో గురువులు అనే దుష్టుడు ఒకడు పచ్చితాగుబోతూ, జూదగాడూనూ. వాడు కొంత కాలంగా గౌరి మీద కన్ను వేసి, ఆమెను తనకిచ్చి చెయ్యమని

కలువకొలను సదానంద



పున్నమ్మను చాలా సార్లు వేధించాడు. కాని పున్నమ్మ ఒప్పుకోలేదు. ఎలాగైనా గౌరిని తనదాన్ని చేసుకోవాలని వాడు సమయంకోసం చూస్తున్నాడు.

మునిమాపువేళ గౌరి సంత నుంచి తిరిగి వస్తూండగా గురువులుకు అవకాశం చిక్కింది. వాడు కొందరు దుండగుల సహాయంతో కొండ మీది గుడి వద్దకు బలవంతంగా తీసుకుపోయి, గౌరి ఎంత ఏడ్చి మొత్తుకుంటున్నా వినకుండా, ఆమె మెడలో తాళి కట్టబోయాడు.

ఇదంతా, సన్యాసి వేషంలో మంటపంలో కూర్చున్న నాగరాజు చూసి, గౌరిని కాపాడ నిశ్చయించాడు. "ఏమిట్రా, ఈ గడబిడ?" అంటూ వాడు లేచి, వాళ్ళ దగ్గిరికి వచ్చాడు.

"పానకంలో పుడకలాగ నువ్వెవడివిరా?" అన్నాడు గురువులు కోపంగా.

నాగరాజు వాడి ముఖంలోకి చూసి, ఆశ్చర్యం నటిస్తూ, "అహా! ఎంత అదృష్ట జాతకం నీది! నువు పట్టినది బంగార మవుతుంది. సిరి నీ కాళ్ళ దగ్గిరికి వచ్చి పడుతుంది!" అన్నాడు.

"నీ మొహం! వెళ్ళు అవతలికి," అన్నాడు గురువులు కోపంగా.

"ఒరే అవివేకీ! పరిహాసమాడుతున్నాననుకున్నావురా? నీ కాళ్ళ కింద నేల తవ్వి చూడరా!" అన్నాడు నాగరాజు దర్పంగా.

గురువులు తన కాళ్ళ కింద తవ్వి చూస్తే, నాగరాజు పాతిపెట్టిన నగలు కనిపించాయి. వాడు వాటిని తన జేబులో వేసుకుంటూ, "మీరు నిజంగా మహాత్ములు!" అని చేతులు జోడించాడు.

తరవాత నాగరాజు గౌరి ముఖంలోకి చూసి, "ఎవరీ ముదనష్టపు పిల్ల?" అన్నాడు.

"అలా అంటున్నారేం, స్వామీ?" అని గురువులు అడిగాడు.

"నిజం దాస్తే, నిండు ప్రాణాలే పోగలవు. ఈ పిల్ల నష్ట జాతకురాలు. దీన్ని

పెళ్లాడినవాడు మూడు రోజుల్లో చస్తాడు,'' అన్నాడు నాగరాజు.

ఈ మాట వినగానే గురువులుకు గౌరి మీద భ్రమ అంతా పోయి, విరక్తి కలిగింది. వాడు ఆమెను వెంటనే ఇంటికి పొమ్మన్నాడు.

మర్నాడు ఉదయం నాగరాజు గౌరి ఇంటికి వెళ్లాడు. ఆ సమయంలో పున్నమ్మ ఇంట్లో లేదు. గౌరి వాడికి నమస్కరించి, లోపలికి ఆహ్వానించింది.

''మొన్నరాత్రి మీ ఇంట దొంగతనం జరిగిన సంగతీ, నిన్న గురువులుగాడికి గుడి దగ్గిర దొరికిన నగలు నీవే నన్న సంగతీ, నీకు తెలుసా?'' అని నాగరాజు గౌరిని అడిగాడు.

''నా కేమీ తెలియదే?'' అన్నది గౌరి ఆశ్చర్యంగా.

నాగరాజు తన సన్యాసి వేషం తీసివేసి, తన గురించీ, తాను చేసిన దొంగతనం గురించీ దాచకుండా ఆమెకు చెప్పేశాడు.

''నువు దొంగతనాలు మానేస్తే నేను నిన్ను పెళ్ళి చేసుకోగలను,'' అన్నది గౌరి.

దొంగతనాలు మానేస్తానని నాగరాజు గౌరి మీద ప్రమాణం చేశాడు.

కూతురి ద్వారా సంగతి అంతా తెలుసుకుని, పున్నమ్మ, గురువులు తన సొమ్ములు దొంగిలించాడని గ్రామాధికారికి ఫిర్యాదు చేసింది. గ్రామాధికారి ఆమె సొమ్ములు ఆమెకు ఇప్పించి, గురువులుకు జరిమానా విధించాడు.

తరవాత నాగరాజు గౌరిని పెళ్ళి చేసుకుని, ఆమెతో తన గ్రామానికి తిరిగి వెళ్ళి, తమ ఇంటి తలుపుతట్టి, ''నాన్నా, తలుపు తియ్యి,'' అన్నాడు.

''పోరా పో! మళ్లీ ఎందుకువచ్చావు?'' అని తండ్రి కసిరాడు.

''నీకు పరువైన కోడలిని తెచ్చాను, నాన్నా!'' అన్నాడు నాగరాజు.

వెంటనే వెంకయ్య తలుపు తెరిచి కొడుకునూ, కోడలినీ ఆహ్వానించాడు.





# రూపకుమారి పెళ్లి

మహాఘపూర్ రాజకుమార్తెకు యుక్త వయసు వచ్చింది. అసాధారణమైన ఆమె అందం గురించి విని గొప్ప గొప్ప రాజులూ, అనేక దేశాల రాజకుమారులూ ఆమెను పెళ్లాడగోరారు. కాని రూప కుమారి తండ్రికి తన కుమార్తెను మణి పూరు రాజైన శ్రీకుమారుడికి ఇయ్యాలని ఉన్నది. శ్రీకుమారుడు సకల సద్గుణ సంపన్నుడే గాక, అతని మాతామహుడి అనంతరం ఆయన పాలించే మానా సంస్థానానికి కూడా రాజవుతాడు.

కాని శ్రీకుమారుడిలో ఒక లోపం ఉన్నది. అతని శరీరచ్ఛాయ నలుపు. అతను ఒకప్పుడు పచ్చనివాడే. కాని ఆరేళ్ళ క్రితం అతను సపరివారంగా వేటకు వెళ్ళి, పాము కరిచి, ప్రాణాలతో బయట పడినా, వివర్ణుడై పోయాడు. ఈ నలుపురంగు కొంతకాలానికి విరిగి పోయి, శ్రీకుమారుడికి సహజ వర్ణం తిరిగి వస్తుందని వైద్యులు చెప్పారు, కాని ప్రస్తుతం అతను నల్లనివాడే.

రూపకుమారికేమో నలుపు రంగంటే ఇష్టం లేదు. మంత్రి ధీమాన్ ఆమె మనసు మార్చ యత్నించి ఈ విషయం తెలుసుకున్నాడు.

"మొహమాటం దేనికి? నేను నల్లని వాణ్ణి పెళ్ళాడను. నాకు నల్లని పిల్లలు పుట్టుకు రావచ్చు," అన్నదామె.

"అదేమిటమ్మా? నల్లని పిల్లలు పిల్లలు కాకపోతారా? మనిషికి ముఖ్యమైనవి మనసూ, స్వభావమూ మొదలైనవి. రంగు అన్నది కేవలమూ కళ్ళకు గోచరించే భ్రమ. పరిస్థితులను బట్టి ఆ భ్రమ అబద్ధం కూడా అవుతుంది. నీ కొక చిత్రం చూపుతాను," అన్నాడు మంత్రి ధీమాన్.

ఆయన చప్పట్లు చరచగానే రూప కుమారి గదిలోకి ఒక సేవకుడు ఒక పళ్లెం మీద గుడ్డ కప్పి తెచ్చి, బల్ల మీద ఉంచాడు. ఇంకొక పక్కనుంచి గదిలోకి రాజూ, రాణీ వచ్చారు.

''బాబుగారూ, ఇదేమిటి?'' అని రూపకుమారి అడిగింది.

ధీమాన్ పళ్లెం మీది నుంచి గుడ్డ తొలగిస్తూ, ''అమ్మా, ఇది నీ దృష్టికి పరీక్ష. ఈ పళ్లెం మీది గాజుగ్లాసులో మన ఇంద్రజాలికుడు, సోమనాథుడు పోసిన మంత్ర జలం ఉన్నది. మెరుపు తక్కువగా ఉన్న చంచా పైకి తియ్యి.'' అన్నాడు.

గ్లాసులోని నీటిలో ఉన్న చంచాలలో ఒకటి తళతళా మెరుస్తున్నది. రెండోది మామూలుగా ఉన్నది. రూపకుమారి ఆ రెండో చంచాను పైకి తీసింది.

''ఇప్పుడు మెరిసే చంచాను పైకి తియ్యి.'' అన్నాడు మంత్రి ధీమాన్.

రూపకుమారి రెండో చంచాను పైకి తీసి నిర్ఘాంతపోయింది. అది మసిపారి, కారు నలుపు రంగులో ఉన్నది! దానిని ఆమె ధీమాన్ కోరిన మీదట తిరిగి నీటిలో పెట్టింది. వెంటనే అది తళతళా మెరవ సాగింది. వెండి కూడా అంతగా మెరవదు!

ధీమాన్ ఆమెతో, ''అమ్మా, చూశావు గదా! కారు నలుపు వస్తువులు కూడా అద్భుతంగా మెరవగలవు. రంగు అన్నది కేవలమూ దృష్టికి సంబంధించినది. అది ముఖ్యమైన గుణం కాదు. శ్రీకుమారుడిలో ఎన్నో మెరుపులున్నాయి. నేను అతన్ని గురించి క్షుణ్ణంగా ఆరా తీశాను. అతని కన్న గొప్ప భర్త నీకు దొరకడు!'' అన్నాడు.

రూపకుమారి శ్రీకుమారుణ్ణి పెళ్లాడటానికి ఒప్పుకున్నది. వైద్యుడు చెప్పినట్టుగానే అతని నలుపు రంగు త్వరలోనే విరిగిపోయి, మామూలురంగు వచ్చేసింది.

నల్లని చంచా తెల్లగా కనిపించటంలో ఇంద్రజాలం ఏమిటి? ఏమీ లేదు! మసి పూసిన చంచా నీటి లోపల తళతళా మెరుస్తుంది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.







M. Natarajan    Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బూరా ఊదిన బొమ్మ ఆడునా ?

రెండవ ఫోటో : తబలా కొట్టిన తాళం పడునా ?

పంపినవారు : పురిఘళ్ళ రఘువీరశాస్త్రి, మలకపల్లి. (ప. గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

**Results of Chandamama-Camlin Colouring Contest No. 7 (Telugu)**

*1st Prize*: M. D. Hussainkhan, Hyderabad. *2nd Prize*: Kadali Suresh, Madras. *3rd Prize*: A. Krishnamurthy, Cuddapah. *Consolation Prizes*: K. V. Nageswarao, Machilipatnam. M. Srinivas, Secunderabad. G. Pradeep Kumar, Nalgonda. S. Gangavva, Karimnagar. R. Sujata, Gooty.

‘ఊ!...మజా మజా రుచి!’







గోల్డ్ స్పాట్–దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.

Creative Unit 3462 Tel.


DADDY
MUMMY


AND...
I


PARLE
Gluco
PARLE
Gluco
BISCUITS




పార్లే
గ్లూకో